

కృతినాయకులు:

బ్రహ్మశ్రీ పాణ్యం లక్ష్మీనరసయ్యగారు, ఉయ్యాలవాడ.

# అభినవాంధ్రవాసవదత్త

ఉప్పల నరసింహశర్మ
ప్రణీతము

చెన్నపురి:
ఆంధ్రపత్రికా ముద్రాలయమున
ముద్రితము

౧౯౨౯] [వెల రు. ౦-౮-౦

# శుద్ధిపత్రము

(తప్పులను పుస్తకములో మొదటనే దిద్దుకొనుట మంచిది)

| పుట | పద్యము | | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| కృతజ్ఞత | ౨ | పంక్తి ౨ | హృత్సద్మ | హృత్పద్మ |
| ,, | ,, | ,, ౪ | పేరమా | వేంకమా |
| ౪ | ౨ | | పరగ | పగర |
| ౧౧ | ౨౪ | | నగ్గించు | సగ్గించు |
| ౧౭ | ౪౭ | | చాయగ్గోలె | చాయగాగ |
| ౨౦ | ౫౬ | | కంఠీరథము | కర్ణీరథము |
| ౨౨ | ౬౧ | | దూర్వాసు | దుర్వాసు |
| ౨౩ | ౬౫ | | ఉన్న త్త | ఉన్మత్త |
| ౩౪ | ౯౨ | | పరలు | వఱలు |
| ,, | ౯౫ | | మత్తమారుని | మత్త! మారుని |
| ౩౭ | ౧౦౯ | | చెప్పేదేని | చెప్పే నేని |
| ౩౯ | ౧౧౨ | | భూభూమి | భూమి |
| ౪౦ | ౧౧౪ | | తేజము గ...తి | తేజమున గ...తి |
| ౪౧ | ౧౧౫ | | కీల | కీలి |
| ,, | ౧౧౭ | | మాని | మాపి |
| ౪౩ | ౧౨౨ | | పీట | పీటి |
| ౪౫ | ౧౨౯ | | క్షణంబునక్ | క్షణంబునుక్ |
| ౫౩ | ౧౫౭ | | మోచరయై | మోచమై |

# ఉపే ష్ప ణ ము

| పుట | పఙ్క్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ౩ | ౨౭ | నేత్రమ్ములు=సానులు | సానులు=నేత్రములు |
| ౪ | ౩౬ | గోభూమి | గో=భూమి |
| ,, | ,, | అర్జుని | అర్క్యుని |
| ౫ | ౪౩ | సంక్షవనీయ | సంశోభనీయ |
| ,, | ౪౮ | తలిరుపిండులు | తలిరుతిండులు |
| ౮ | ౫౮ | కంక్రీరధము | కర్ణీరధము |
| ,, | ,, | కబరి=కొప్పు...ది | ———— |
| ౧౩ | ౧౨౮ | చేయనున్న | సేయుచున్న |
| ౧౫ | ౧౫౬ | మోచరై | మోపనై |
| ౧౮ | ౧౮౮ | సమిధలు గాఁగలవానిని | సమిధలు మొదలు గాఁగల వానిని |

———

-



శ్రీ ఉప్పల నరసింహ శర్మ
కృతికర్త

శ్రీ పాలచ్చూరు రాఘవ రెడ్డి గారు
కృతిభర్త

శ్రీ ర స్తు

శ్రీమత్పరదేవతాయై నమః

# మనవి

---

శ్రీ సోమశైలేశ్వరీయ గ్రంథరచనానంతర మొకనాఁడు మద్గురుశిష్యులు, మన్మిత్రులు, విద్యాభిమానులు, వితరణఖనులు, ఏకొల్లుగ్రామ వాస్తవ్యులు, పంటకాపు కులజులు, నగు శా. షాలచ్చూరు రాఘవరెడ్డిగారు 'శ్రీసుబంధుకవి రాజకృతి గద్యమయియగు వాసవదత్త శ్రీవట్టిపల్లి నరకంఠీరవ కవివరుఁ డార్యావృత్తములతో నభినవ వాసవదత్త యనుపేరవిరచించిన పొత్తముఁ దెలిఁగింపుఁడు; తన్ముద్రణాదికార్యముల నే నెఱవేర్చెద' నని పరమాదరమున వాగ్దానమొసంగి మూల గ్రంథము నాకడ కంపిరి. అంతట నే నీగ్రంథము నాంధ్రీకరించఁగల్గుదునా? యని శంకించియు మిత్రప్రేరణమే యూఁతగా నెట్లో యిద్దానిఁ దెలిఁగించితి. మూలమునందలి "అత్రాంతరే" అను శ్లోకమునకుఁ దరువాతివగు 1. "ఆత్మానం", 2. "వీరః", 3. "ఆశ్రయతి" అను మూఁడుశ్లోకములు నాంధ్రీకరించుటకు నాకసాధ్యములుగాఁ దోఁచినందున వానిఁ దెలిఁగించలేదు ఏతద్విషయక మదీయాసమర్థతాపూర్వక సాహసిక్యమునకుఁ బ్రాజ్ఞులు క్షమింతురు గావుత. ఈగ్రంథముముద్రణ

మునకై శుద్ధప్రతిగా వ్రాయుటకు నాకు వీలు లేకుండెను. ఒకప్పుడు మన్మిత్త్రులు రా. దూబగుంట వేంకటకృష్ణయ్యగారిద్దాని శుద్ధముగా వ్రాసి నాకొసంగిరి. తరువాత నా మిత్త్రులు సుకవులు నగు శ్రీ. వేదము వేంకటకృష్ణ శర్మగారీ గ్రంథముఁ జదివి యిద్దానికి లఘుటీకయుండినఁ జాల మేలని నాకుం దెలిపినంతట నాకార్య మాయనకే యొప్పగించితి. వారు సత్పూర్ణదయాపూర్ణమనస్కులై యందులకు సమ్మతించి యప్పని నెఱవేర్చిరి. నేనును జిరకాలపరిచయమునం జేసి నన్నెడఁబాయని యాలస్యమిత్త్రుని సాయమున లఘుటీకతో నప్పొత్తము ముద్రింపించక యట్లె యుంచితి. విధివశమునఁ దటస్థించిన మజ్జననీ జాయా నేత్ర వ్యాధిఁ గుదుర్చుకొనుటకై, మత్ప్రియభావుకులగు శ్రీ. సురభి కృష్ణయ్యగారు, మదగ్రసోదరి యగు కామాక్షమ్మ వీరల యనుపమాన సాహాయ్యమునఁ గొన్ని దినములు చెన్నపురి నివసించుతఱి శ్రీ రెడ్డిగారు నాకడకరుదెంచి తాము వాక్రుచ్చిన చొప్పున నేతద్గ్రంథ ముద్రణాద్యర్థము వలయు ధనము సత్యుత్సాహముతో నొసంగిరి. అంతఁ బొత్తము నిట్లు ముద్రితము గాఁగని శ్రీ రెడ్డిగారి కచిరమున నందింపఁ గల్గినాఁడను. గ్రంథమున నేమి, టీకయం దేమి యెన్నియేని దోసము లుండును. ఉండు నననేల? ఉన్నయవి. వానినెల్లఁ దజ్జ్ఞులగు పండితులు మన్నించెదరు గావుతమని వారి మిక్కిలి ప్రార్థించుచున్నాఁడను.

ఉప్పల నరసింహాశర్మ.

# ఉపోద్ఘాతము

ఆంధ్రవాగ్దేవికిఁ బ్రాక్తన విద్వద్రత్నములును, గవివరేణ్యులును నొడగూర్చిన యనుపమానాలంకృతుల కన్న నాధునికులగు పండితప్రకాండులును, గృతికర్తలును సంతరించుచున్న కైసేఁత లించుకయును దీసిపోవునవి కావు. స్వభాషా పోషణాభిలాషము, స్వదేశ ప్రభువర్యులలో నశించుచున్నను, బయలువెడలుచున్న గ్రంథరాజిం బరికించుచో, సారస్వతమెన్నిగతుల నభివృద్ధి గాంచుచుండు నదియు సహృదయులకు గోచరింపకమానదు. అందుభాషాంతరీకరణఫక్కికి ప్రాధాన్యమయినది. ఏలయన, నీ నవయుగమునందలి సుప్రసిద్ధకవీంద్రు లనేకులాంధ్రీకర్తలే యనుట నిర్వివాదాంశము. సంస్కృతకావ్య నాటకాదులే కాక, పురాణములును మరలఁ దెనిఁగింపఁబడుచున్నయవి. అట్లు తెనిఁగించుటలోఁ బూర్వకవులను "ద్రోసిరా"జని తామందులకుఁ "దగుదు"మని, కొందఱు పూనుకొనుచుండ, వారిని వీరినిగూడ మించవలయునన్న కౌతూహలమునఁ గాఁబోలు, మఱికొందఱు చర్వితచర్వణముగ, నాంధ్రీకరింపబడియున్న గ్రంథములనే మరలమరల వ్రాయఁ బూనుకొనుటచే, నాంధ్రీకరణ మొక "వేలమువెఱ్ఱి" క్రిందఁ బరిణమించినది. ఈవిషయమునఁ బూర్వకవు లెంతయు

సంస్తవనీయముఁ బ్రవర్తించిరని భాగవతము నందలి "ఒనరఁగ నన్నయ తిక్కనాదికవు లీయుర్విఁ బురాణావళుల్ దెనుఁగుఁ జేయుచు, మత్పురాకృత శుభాధిక్యంబు దానెట్టిదో, తెనుఁగుఁ జేయరు మున్ను భాగవతముం దీనిం దెనింగించి" యన్న పోతనామాత్యుని వాక్యము తార్కాణించుచున్నయది. ఇఁక నిప్పటివారీ నియతిని బాటింపక, యూరక పిష్టపేషణ న్యాయము ననుసరించుచుండుటెంతయు శోచనీయము. ఇఁకనైన నాధునికు లీ మార్గము నుజ్జగించి తెనిఁగింపఁబడని యమూల్యామర భాషాగ్రంథములవంకఁ దమదృష్టి సారించిరేని దేశమునకును భాషకును నెంతయు శ్రేయస్కరమగును.

ఇఁకఁ బ్రకృతాంశమునకు వత్తము. వాసవదత్త సుబంధుకవిరాజకృత గీర్వాణ గద్య ప్రబంధరాజము. ప్రత్యక్షర శ్లేషాలంకార విశిష్టము. నవనవరసభావ బంధురము. ప్రౌఢదీర్ఘసమాస భూయిష్ఠము. దాని నార్యావృత్తములలో సంక్షేపించి కార్వేటీనగరాస్థాన విద్వత్కవివరేణ్యులును, గీర్వాణ వాణీవిలాసమందిరాయమాణ రసనాంచితులు నగు బ్రహ్మశ్రీ వట్టిపల్లి నరకంఠీరవ శాస్త్రిగారు విరచించిరి. అద్దాని కాంధ్రీకరణమే యీ గ్రంథరాజము.

మూలగ్రంథకారుని హృదయము నెఱిఁగి, యర్థాలంకారములు చెడకుండ, సముచితశబ్దజాలముం గూర్చి, రసభావపుష్టముగ నీగ్రంథ మాంధ్రీకరించుట మిక్కిలి కష్ట

సాధ్యమగు కార్యమగుటచేతనే యింతవఱ కెవరును నందులకుఁ బూనుకొన సాహసింపరయి రని తలంచెద. కాని, యీయాంధ్రీకర్తగారు, మూలగ్రంథకారుని వలెనే-కవిసార్వభౌమునివలెనే-యీగ్రంథమును బండితజనహృదయంగమముగ రచియింపఁగలుగు పాండితి "నూనూఁగు మీసాల నూత్నయౌవనముననే" సముపార్జించిరని,వీరిదివఱకు వ్రాసిన భృంగాపదేశ సోమశైలేశ్వరీయాది గ్రంథములఁ బఠించినవారి కెఱుకయే. వీరికవనమునఁ జెత్తపదమొండేని మచ్చునకైనఁ గనఁబడదు; సరికదా. రెండుముక్కయసలే కనఁబడదు. తూఁచివైచి, యతికినట్లు ప్రతిశబ్దమును దానున్నస్థానమున కుచితమగు రసముం గుమ్మరించుటలో నద్వితీయముగ వెలయుచుండును. మచ్చునకొకటిరెండు పద్యములు:

"అంగజుండె సృజించెనౌ హాసుదానిఁ
దోఁచితోఁచని కౌఁదీవఁ దొలఁకుదాని,
మేల్ కడానికిఁ దులయైన మేనిదానిఁ
బదియు నెనిమిదియేండ్లు కావచ్చుదాని"

"శంక యొకింత లేక సర
   సన్ నిలువందగదే సఖీ! మదీ
యాంక మలంకరింపుమీ
   శశాంకముఖీ! మదిఁగోర్కెఁ దీర్పవో
పంకజలోచనా! యితనిఁ
   ద్విట్ప్రియకింకరు మత్స్యలాంఛనా

శంకోవిమోచనంబున స
హా దయఁజాలిచి యుద్ధరింపుమా.

ఇందలి యితివృత్తము బోధ మగునటులఁ గవి గారు లఘుటిప్పణమును సయితమిందుఁ జేర్చుటచేఁ బాఠకుల కెంతయు దురవగాహములగు పట్టులును గరతలామలకములగునట్లొనర్చిరనుటకేమాత్రమును సందియము లేదు

ఈయప్రతిమానకావ్యములోని నిగూఢభావముల గ్రహించి, కర మానందించి కవిగారి నాంధ్రీకరింపఁ బ్రోత్సహించి యీగ్రంథముద్రణమున కగు వ్యయము నంతయుఁ దామేభరించిన సారస్వతాభిమానులును, నాంధ్రభాషా వైదుషీవిభూషితులును, సత్యశౌచదయాధర్మనిరతులును 'ఏకొల్లు' గ్రామవాస్తవ్యులు నగు శ్రీయుత పాలచ్చూరు రాఘవరెడ్డిగారి కీర్తిచంద్రిక లీయాంధ్రప్రపంచ మున్నంతకాలము వెలయఁగలదు. పరమేశ్వరుఁ డీ రసికజనరత్నమునకు నిత్యాధికాయురారోగ్య భాగ్యంబు లొసంగి, యిట్టి శాశ్వతసత్కార్యము లితనిచే నింకను జేయించుంగాక!

అనూనకవితా సామ్రాజ్య పట్టభద్రులును, నేతద్గ్రంథకర్తలు నగు బ్రహ్మశ్రీ ఉత్పల నృసింహశర్మగారిపు డధ్యాత్మరామాయణ మాంధ్రీకరించుచున్నారు. అయ్యదియుఁ ద్వరలో వెలువడి యాంధ్రశారద కొక యమూల్యాలంకార మగుఁగాక! ఇట్లు

వేదము వేంకటకృష్ణశర్మ.

శ్రీరస్తు

# కృతజ్ఞత

శ్లో. శ్రీమత్పాలచ్చూర్యగ్ర్యాల
కలశాబ్ధేః పూర్ణతుహినధామానం;
రాఘవరెడ్డ్యభిధానం
సద్గుణభూమాన మీశ్వరః పాయాత్.

సీ. ఎవనిముత్తాతయై యొసఁగె వేంకటరెడ్డి
పేరమాహాత్మ్యసద్మభృంగమగుచు
నెవ్వనితాతయై యొసఁగె వెంగారెడ్డి
పేరమాప్రణయార్థపేటి యగుచు,
నెవ్వనితండ్రియై యొసఁగె సుబ్బారెడ్డి
భాగీరథీప్రాణభర్త యగుచు
నేవానిపుత్త్రుఁడై యొసఁగెడు సుబ్బరా
ఘవరెడ్డి యున్నతాయువును గాంచి
యెవఁడు సుబ్బాంబికారమ్యదృక్చకోర
పూర్ణిమాపూర్ణవిధుఁడయి పొల్పుమీఱె
నతఁడు రాఘవరెడ్డి సమాఖ్యుఁ డెప్పు
డలరుఁగావుత భోగ్యభాగ్యాభివృద్ధి.

సీ. నిజకీర్తి నర్తకీనిస్తుల నిత్యరం
గస్థలద్వీపుల జగత్తలుండు

ఇందిరాసుస్థిరసుందరక్రీడా గృ
హాయిత చిత్రసౌధాంగణుండు
నిర్నిద్రభారతీ నిరుపమభాండార
పశ్యతోహార ముఖబంధురుండు
శైలరాజాత్మజా శంకర సురుచిరా
స్థానీభవన్మనస్సరసిజుండు
సుకృతి సుకృతి సముద్ధరణ కృతినిరతి
సత్య శౌచ దయాధర్మ సంగతమతి
యైన రాఘవరెడ్డి పంటాన్వవాయ
తిలకమఖిలార్థసిద్ధి వర్ధిల్లుఁగాత.

ఉ. కుందక వెల్వెలం జనక
కొంచె మొసంగక మోసపోక తా
చందము లేక భంగపడు
చక్కిఁ యొకానక యిచ్చుదాత తన్మా
యం దితఁడన్న సన్నుతుల
నందిన రాఘవరెడ్డి భోగ సం
క్రందనుఁడై సదా పొలుచుఁ
గాత సతీసుతపౌత్రయుక్తుఁడై.

తే. ఆత్మపరిపాలితార్యుఁ డత్యంతపాలి
తార్యపరిపాలితాత్ముఁడై యలరుఁగాత
అహిత విద్యాధికారి విద్యాధికారి
యైన రాఘవరెడ్డి చిరాయురాప్తి.

శ్రీమతే

పరదేవతాయై నమః

# అభినవాంధ్ర వాసవదత్త



బృందారకమణి మకుటీ
సందానిత సుమ సుగంధి చరణద్వయికిన్
వందారు జనాభిలషిత
మందారున కీశునకు నమస్కృతు లిడుమన్. ౧

తే. మదన పరిపంథి, దేవేరి, మందహాస,
ముగ్ధ, మధురాస్యకమల, సముజ్జ్వలాంగి,
మఘవ ముఖ్యామరశ్రేణి మహిత లలిత,
నిండు కృప నా మనంబున నుండుఁ గాత. ౨

తే. ఘన మబోధ తమోభంజకము, నిరంత
రాయము, నిరంతరంబు, నిర్వ్యాజ, మఖిల
దేవతోపాస్య మగు నొక దివ్యదంతి
వదనరూప మహంబును భక్తిఁ గొలుతు. ౩

ఆ. సకలలోకజనని, సరసీరుహాసను
రాణి, భ్రమరనీలవేణి, వాణిఁ
బాణికమలకలిత వీణ నోకించుక
కవన కౌశలంబుఁ గాంచఁ గొలుతు. ౪

తే. అలచతుర్ముఖు ముఖములయందుఁబోలె
నెలమిఁ గ్రీడించు వాగ్దేవి యెవని మోముఁ
దమ్మి, నాపుట్ట పుట్టువు తపసి కేను
జాఁగి మ్రొక్కి నుతింతు నంజలి ఘటించి. ౫

ఆ. వ్యాస కాళిదాస భాస ప్రముఖులైన
ప్రాక్కవీంద్రులకు సభక్తి నెఱఁగి
క్రన్న సన్నుతింతు నన్నయ తిక్కనా
ద్యంధ్రకవి వరాళి నభిమతముగ. ౬

క. తనకుఁ దెలియని వన్నియు
ఘన దోషములంచుఁ బల్కు కాకవి నాడఁ
బని యేమి? తజ్ఞు లేప
ట్టునఁ జేయరు వానికిఁ గడుంగడు శాస్త్రిఁ. ౭

సీ. భక్తితో నిష్టదైవముల సంప్రార్థించి
సత్కవీడావళి సన్నుతించి
గద్యాకృతి సుబంధు కవిరాజ కృతమైన
వాసవదత్తా వివాహగాథ

నద్భుతరీతి నార్యావృత్తరూప ప్ర
బంధముగాఁ జేసె వట్టి పల్లి
వంశపయోవార్ధి పార్వణేందుఁడు నర
కంఠీరవాఖ్యుఁడౌ కవివరుండు.
షోడశాబ్దము నందె నిస్తులమనీష;
నేకవింశతి వర్షమం దేను భీవి
హీనతఁ సుగుణంబుల కెల్ల నెల్ల
యైన యీాకృతిఁ దెనిగింపఁ బూనినాఁడ. ౮

ఉ. పిన్న తనంబునఁ జదువు
వేళనె వచ్చియుగాని కైతమేఁ
దిన్నఁగ నల్లికొం చదని
దేయని సోమశిలేశు గాథ ను
ద్యన్నిరతిఁ రచించి బుధ
హస్తములం దిడ వారు దానిఁ బ్రీ
త్యున్నతిమై గ్రహించి తమ
యుత్తమ భావము వెల్లడింప రే! ౯

తే. అతి కుశలు రెందఱో వారి దగు నిబంధ
నంబు లెన్నియొ యుండిన నా యెడాట
మునఁ బ్రసన్నదృగ్జులై బుధవరేణ్యు
లీకృతి మహాదృతిఁ గ్రహియింత్రుగాక. ౧౦

క. సోమునకుఁ నిరతోజ్జ్వల
సోమాశన భూషణునకు, సోమధరునకుఁ,
సోమ ప్రియ మిత్రునకుఁ
సోమజనయనునకు సోమశుభ్రాంగునకుఁ. ౧౧

క. అవిరళ భక్తి యొసందఁ
దవులఁగ నే నంకితం బొనర్పఁ దివురు నీ
నవరస లస దభినవ వా
సవదత్తాకృతి చరిత్ర సరణి యెటులనఁ. ౧౨

## కథా ప్రారంభము

శా. శ్రీమంతుం డతుల ప్రభావుఁడు గుణ
శ్రీలుండు దానర్ధిఁ జిం
తామణ్యాఖ్య వహించి మించె నొక భూ
నాథుం డతం డొప్పెఁ బ్రో
ద్దామ స్వీయ పదాంబురుణ్ణఖర ర
త్నశ్రేణి నానావనీ
స్వామి వ్యూహ శిరోమణీ సుకష క
ర్షస్ఫూర్తి వెల్గించుచుఁ. ౧

తే. ఉండె నాతని కొక కొమరుండు వినయ
వర్తి కం దర్పకేతు వఁవాఁడు పరగ

కాలమునకుఁ దోకచుక్క; యెక్కుడుగ మీను
సిడెము దొర మేలమాడు మైబెడఁగువాఁడు. ౨

తే. అంత నొకనాఁడు మారు సౌరైన గొడుగు
పగిది విలసిల్లు కుముదినీవల్లభుండు
దూరమౌ దారి దాఁటి శ్రాంతుఁడును బోలె
నస్తగిరి మస్తకంబున కవతరింప. ౩

క. ఆనృపతనయుఁడు గనెఁ గల
లో నమర మృగాక్షిఁబోలె లోకత్రయ మా
న్యా నన్యాదృశరూపా
న్యూన శ్రీధన్యఁ గన్య నుల్లంబలరన్. ౪

తే. అంగజుండె సృజించెనన్ హాసుదానిఁ
దోఁచి తోఁచని కౌఁదీవఁ దొలఁకుదాని
మేల్ కడానికిఁ దులయైన మేని దానిఁ
బదియు నెనిమిదియేండ్లు కావచ్చుదాని. ౫

తే. పటుకటీరైణలాంఛనపరిధి పగిదిఁ
గ్రొత్తనూగారు తీవకు గుండ్రకుదురు
కరణి రంగారు బంగారు కాంచి మించు
టొఱపుమెఱపులఁ బఱపించు నొఱపుదాని. ౬

క. ఘన మగు నీ స్తనభర మిదె
తనపైఁ బడునని భీతిఁ దలచూపుట నో

యనఁగాఁ గృశతావశతలఁ
గనుపించెడు కౌనుదీవఁ గ్రాలెడు దానిన్. ౭

తే. స్మరుని లీలాగృహంబులో! మరుఁడు మచ్చు
మందు నింపిన కడవలో! జెందమనెడు
ముద్దుకొలనికిఁ బొందమ్మి మొగ్గలేమొ!
నాఁదగిన చన్నుదోయిఁ జెన్నారు దాని. ౮

తే. అమృతపుం జవి మధురిమ నతకరించి
ననుపుఁ గడలికిఁ బవడంపుఁ దునుకఁ బోలి
చివురుడాల్ డీల్పఱచు మోవిఁ జెలువుమీఱు
దాని ననమాన సౌందర్య మైనదాని. ౯

క. మదమదనంబుల భూషిత
వదనంబులఁ గుందజాల వరశోభా శ్రీ
సదనంబుల మౌక్తికకృత
కదనంబుల రదనములఁ బ్రకాశిలు దానిన్. ౧౦

క. భాసురదృగమృత సింధు మ
హాసేతువు యువ మనోద్విపాలాన సము
ల్లాసియయి యొప్పమీఱెడు
నాసా వంశోత్తమంబునం దగు దానిన్. ౧౧

ఆ. రతియుఁ బంచశరుఁడు రాణఁగొన్న శరాస
నముల తీరు మీఱు నాణెమూని

కన్నుదోవల మఱుఁగి చెన్నొందు తేఁటి చాల్
వోలె నిక్కుఁబొమలఁ గ్రాలుదాని. ౧౨

క. పరిపూర్ణముఖేందునకున్
గరముఁ గళంక మను శంకఁ గల్పించుచు భా
స్వర మృగమదపంక సుసూ
క్ష్మ రచితమగు చిత్రకంబు గల నిటలతటిన్. ౧౩

సీ. ఎంతయుఁ దరళదృగంత నకాంతి నా
దరమునఁ గన్నులఁ ద్రావువాఁడు
వలెఁ జాలసేపు తన్నబ్బిన నిదురపైఁ
బుట్టిన యాసునఁబోలె లేచి
యతను శర శరవ్యతాపన్నహృదయుఁ డా
కొమరుఁ డంత విసంపుఁగొలని మునిఁగి
నట్టేఁడు నా బుద్ధుఁడై యాత్మఁదాల్ప వ
లంతి కా కవు డా విలాసవతినిఁ
గాఁగిలింప నుత్సాహియై క్షణములోన
మింటి కల్లన బాహువుల్ మీఁఱ సాఁచి
చిత్రితనుబలె నా సరసీరుహాక్షి
నన్ని దిక్కులఁ జూచు చిట్లనుచుఁ బిలిచె. ౧౪

తే. "చంద్రముఖి" రమ్ము రమ్ము, నీచరణదాసుఁ
దరుణు విడనాడిపోవంగఁ దరుణి! తగవె?

అమృతరసభంగముల నపాంగముల మిఘులఁ
జలువఁ గొలుపుము న న్నంగజ ప్రతప్తు. ౧౪

మ. దయితా! నీదయితుండ దాసుఁడను చి
త్తంబుంపుమా! నాపయిన్
రయ మారన్ మధురాధరం బొసఁగుమా
నన్ గోరెదన్ లేమ! కా
మయ మాన్చన్ లసమాను గామసము న
మ్మాన్యున్ ననున్ వాసుతున్
దయ డాయన్ జనుదెంచి యిప్వ డెటులో
తన్వంగి! పోఁ బోయెదే? ౧౬

ఉ. శంక యొకింత లేక నర
నన్ నిలువం దగదే సఖీ! మదీ
యాంక మలంకరింపుము శ
శాంకముఖీ! మదిఁ గోర్కెఁ దీర్పు మో
పంకజలోచనా! యితనిఁ
ద్వత్ప్రియ కింకరు మత్స్యలాంఛనా
తంక విమోచనంబున స
దా దయఁ దాలిచి యుద్ధరింపుమా. ౧౭

సీ. అని పల్కువాని శయ్యాతల శయితుని
వారితాశేష సేవకుని నిఖిల

ముఖ్యోపభోగవైముఖ్య నెంతేనియుఁ
గడఁక నారేబవల్ గడపువానిఁ
కందర్పకేతునిఁ గందర్పశర సంప్ర
హారతప్తునిఁ గాంచి యతని సఖుఁడు
ప్రాణతుల్యుఁడు మకరందుఁ డనెడువాఁడు
చెంగటఁజేరి వచించె నిట్లు
మిత్రమా! పూనినాఁడ వేమీ? యనర్హ
మై యసాధు జనోచితం బైనసరణిఁ
ప్రబల సందేహ డోలాధివాసులగుచు
నున్నవారలు పెద్దలు నిన్నుఁ జూచి. ౧౮

ఆ. ఖలులు సమయ మిదియకా యని నీ కని
ష్టంబుఁ దలఁతు రయ్య! సంగడీఁడ!
విదితమగునుగాదె? పిశునుని డెందం బ
నిష్ట మొదవఁజేయ నెంచు నెపుడు. ౧౯

ఉ. నావచనంబు సేయుము మ
నంబున సాధుజనోచితంబు నా
త్రోవఁ జరింపుమా! యెపుడు
దుశ్చరితాచరణంబు మానుమా!
యే వగనైన ధైర్యము వ
హింపుము! యాత్మఁ దిరంబుఁ గాఁగ సం

భావన సేయుమా! నృపకు
మార! విచార విహారి కాకుమా! ౨౦

సీ. అతి మృదు వాఙ్మాధ్వీసహాసిత మరందుఁడౌ
నామకరందుఁ డిట్లనుఁడు నతని
తోడఁ గందర్పకేతుఁడు మెల మెల్లఁగాఁ
బరిమితాక్షర మగు పలుకుఁ బలికె
సఖ! యుపదేశావసరము నీ కిది కాదు
పాయనిదౌ నా యవస్థ వినుము
కాయజాస్త్రంబుల గాత్రంబు లిపుడు భ్ర
గ్నుచు నున్నయవి ప్రభంగురత నెనసి
అంగ ముమ్మాగిల్లె నఖిలేంద్రియంబులు
వేగఁ దొడఁగె, మఱి వివేక ముడిగె
మర్మముల్ గలంగె, మకరంద! యెద్దియో
కష్టదశను మిత్రులఁ గాంచ వలసె. ౨౧

క. పలుమాట లేల? సిక్కఁ—పుఁ
జెలిమియె తలపోయుదేని శీఘ్రము నే నె
వ్వాఁనికిఁ బోవుదు నాదెస
కలయక యీ దీనుతోడ నరుదెమ్ము సఖా! ౨౨

ఉ. దుర్గమచింత నిట్టులని
తోడన నేరికిఁ గానరాక యే

మార్గ మనేక నల్వశత
మాత్రము నెయ్యునితోడ దాఁటి ద్వి
డ్వర్గ విదారియైన నర
పాలసుతుండు మహాటవీ సరో
వర్గళ తీర భూరుహ చ
యంబులఁ గాంచుచుఁ బోవ ముందటన్.

సీ. మృగరాజవిత్రస్త మృగరమణీ కులా
కుల సముపాంతమై యలరుదాని
గడవపుట్టువుమాటఁ గడవరాదని వేయి
కొమ్ముల నగ్గించుకొన్నదాని
శృంగాగ్రమున సంచరించు విద్యాధరా
వళిపాట లాలించి లలిసుఖించు
చమరుల సమయింప గమకించు నెఱకుల
యొఱిఁడిగల సాను లొప్పుదానిఁ
గలయఁగాఁ బ్రవార్షిణులు లలితాక్రమ
ములు కుసుమవిచిత్రములు సువంశ
పత్రపతితములగు వల్లరీతతుల వృ
త్తక్రమంబుఁ దెలిపి తనరుదాని. ౨౮

తే. హారి శైవాలకచ శఫరాక్షి రమ్య
పద్మకుట్మల సుకుచ యావర్తనాభి

ఖిల లహరి బాహులతయునై వెలయు రేవ
చే సమాశ్లిష్ట మగు వింధ్య శిఖరిఁ గనియె. ౨౫

క. కని కొండఁ గడచి యానృప
తనయుం డొక త్రోవఁ గొంత దవ్వేగి కనుం
గొనియెన్ శాఖాచ్ఛాయా
జనయిష్య చ్ఛ్రాంతి నొక్క జంబూతరువున్.

తే. కుసుమ సుకుమారుఁ డ్ల రాకొమరుఁ డలపుఁ
బెల్లునం జిక్కి యా మ్రాని చల్లనీడ
వేఁడి వేలుపు వెలుఁగుల వెట్టఁ దాఁకి
విహ్వాలంబైన యొడలిత్రో విశ్రమించె. ౨౭

క. అంబరమణి త్రిభువన దీ
పం బంబుజినీ ప్రియుం డపర భూధర కూ
టం బెక్కుచు బింబ ఫలా
డంబరమున్ డంబుగన్ విడంబింపంగాన్. ౨౮

తే. పలువిధములైన ఫలమూలములను దెచ్చి
యొసఁగె మకరందుఁ డపుడు నెయ్యునకుఁ గూర్మి
బ్రాఁతి నెచ్చెలి కొన మిగుల్వడిన వాని
నెలమిఁ దానును మెసవి యా నెలవునందు. ౨౯

తే. తలిరుఁ బాన్పు రచింపఁ గందర్పకేతుఁ
డా దయిత నాత్మ హృత్ఫలకాంతరమునఁ

దలఁపు వాఁగఱ లిఖితయా దాని నపుడె
కాంచు వాఁడునుబలె శయనించి యుండె. ౩౦

తే. రాజ జంబువృపైనఁ బరస్పరంబు
మాటి మాటికిఁ గలహాయమానములయి
క్రాలు శుకశారికల కలకలము నా నృ
పాత్మజుఁడు రేయి తొలిజామునందె వినియె. ౩౧

క. అమృతరస విదిత మాధు
ర్యము నేత త్కీరశారికాలాపము మి
త్రమ! యాలింపుదమని రా
కొమరుఁడు మకరందుఁ బలికెఁ గుతుకము మీఱన్.

ఉ. అంతట శారి కోప తర
ళాక్షరపూరిత వాక్ప్రచారయై
పంతమునన్ శుకంబుఁ గని
పల్కె నహో కితవాగ్రగణ్య! శా
ర్యంతరమున్ దగన్ మరగి
యర్మిలిఁ జూపఁగ వచ్చితీవు నే
యింతకుఁ జెల్లునంత కెట
కేగితివో? యెఱిఁగింపు కానిచోన్. ౩౩

చ. అన విని కీర మిట్లనుఁ బ్రి
యా! దయఁజూడుము నన్నుఁ గాల లం

ఘనమునకుఁ గతంబు విను
కంటి నపూర్వమహాకథఁ నిద
ర్శనముఁగ, నిప్పు డక్కతన
రాతిరి యింతకుఁ జెల్లెఁ గాని యే
నిను విడనాడి యారా! చన
నేరుతునే? మఱి యెందుచోటికిఁ. ౩౫

క. అనుచుం బోడము తమిఁ బ్రేయసి
తను నిర్బంధింపఁ దద్దఁ దత్కారము మె
త్తని తియ్యపల్కు పోహణ
పొనరఁగ నాకథను జెప్పఁబూనెఁ గ్రమముగాఁ.

తే. ఎన్నియో యంగళుల నిండుకొన్న మేలి
దండి బండంబులఁ జెలంగి దాఁటరాని
పాటిలేని యగడ్త నొప్పారి కుసుమ
పురము వఱలుఁగదా సురపురి మరల్చి. ౩౬

సీ. కవ్వపుఁ గొండ శృంగములునాఁగ సుధా ధ
వళములౌ వప్రాంతములఁ జెలంగి
బలి భవనంబులఁ బలె సుతలోద్భాసి
తంబులౌ గృహముల డంబుమీఱుఁ
దత్పట్టణంబు సదాగతి రీతి స
త్పథగామి సూర్యునిపగిది గోప

తియు నయి, యవిరతోత్కృష్ట ధర్మాంచిత
శీలమైతగుఁ బౌరజాల మచట
నిచ్చగించి యెప్పు డింద్రాణి సేవించు
నాక సుందరీజనంబుఁబోలెఁ
బైక మనఁగ రమ్య పల్లవరుచినొప్పు
వారజనము కుసుమపత్తనమున. 38

తే. మిన్నొరయఁ జాలు మేడలు మిక్కుటంపుఁ
గలి రిపుల నెల్లఁ గలఁచు మొక్కలపు బంట్లు
అన్యకృత రోధములుఁ గాన్పైన మదపు
టేనుఁగులు గల్గి యాప్రోలు జానుమీఱు. 39

మ. సురతాయాస సుషుప్త సుందర వధూ
శుభ్రస్ఫుర ద్రత్న భా
స్వర తాటంక సమంకితోరుభుజుఁడై
పాలించు నాప్రోలు ను
ద్ధుర లక్ష్మీవిభవాధరీకృత మహేం
ద్రుం డౌచు శృంగార శే
ఖరుఁడక్షా త్రిలకుండు దానగుణ వి
ఖ్యాతిన్ బ్రజల్ మెచ్చఁగాన్. 40

తే. పొదలు మార్తుర సిరి కొప్పు పూవుసరుల
తావిఁ జిమ్మెడు కేల్ దమ్మిఁ దాల్చు నతఁడు

ఘన ధనుర్జీవ భరనమాకర్షణమున
దాయ నిర్జీవుఁ జేయు నమేయబలుఁడు. ౪౦

క. నిశల మలినాంబరత్వము
రశనా బంధము విదగ్ధ రతుల ద్విజహాతుల్
భ్రూశ మధరములనె శృంగా
రశేఖరుం డేలుచోఁ బౌరయ దొందుకడక్. ౪౧

ఆ. సుగుణ రత్నరాశి సుకుమార శైలరా
జాత్మజాతఁ బోలె నమల వంశ
శీల సంపదలఁ బ్రసిద్ధయై యొప్పు న
నంగవత్యభిఖ్య నతని రాణి. ౪౨

క. కలిగె సుత యిర్వురకుఁ గో
మల వాసవదత్త రూపమదమత్త మనో
జలలిత విజయధ్వజ సక
లలోక సంలోభనీయ లావణ్యయునై. ౪౩

ఆ. అంత నబ్బిడకును నతిజృంభమాణ లా
వణ్యమైన తరుణభావ మొదవెఁ
దరుణి తరుణిమమునఁ బరిణామ యయ్యును
బరిణయమున కొల్లఁ బాటుఁ జూపె. ౪౪

తే. అంత నొక్కప్పు డామని యవతరిల్లెఁ
గ్రొత్త పూఁదావి దిక్కుల కొనలు సొమ్మ

సిల్లి రతికాంతుఁ డెలమి వర్ధిల్ల విరహి
తరుణులు కృతాంతునకుఁ బోలె దద్దరిల్ల. ౘ౫

సీ. ఘనముగా మదిర నించిన కామినులనోటి
పుకిలింత పంకెనఁ బొగడ పూఁచె
రవణించు నందియ రాణించు కొమిరెల
కాలి తాపున నశోకంబు విరిసె
మరు పోతరంబున మనలెడు జవరాండ్ర
కౌఁగిలి గోరఁట కలయ విచ్చె
నలువారు తలిరుతిండుల యలబలములఁ
బొలయల్కకూటువల్ బోరిఁ బొసంగె
నోలి విరిదామరలనుండి యొడిగిల్లు
మేల్ మధువుఁ గ్రోలి తేఁటిచాల్ మివులబలిసెఁ
గోవెలల్ ద్రోటిఁ ద్రుంపజాల్గొన్న పాట
లముల తేనెల తుంపరల్ దనరె నపుడు. ౘ౬

తే. వృంత నిర్గత విచికిల వివరమందుఁ
గూయుచు మధువ్రతం బప్డు కొమరు మిగిలెఁ
గమ్మ విలుకాని మూఁడులోకముల గెలుపు
శంఖరవమునఁ దెలిపెడు చాయఁబోలె. ౘ౭

క. రమణీయ యావకాంకిత
రమణీ చరణప్రహార రాగవశమునన్

గమనీయ పల్లవ వ్యా
జమున నశోకంబు రాగసరణిన తాల్చెన్. ౭౮

ఆ. స్తబకుల గుచ్ఛ వినత విదిత పుష్పోద్భేద
తరుణ పల్లవ ప్రధాన రాగ
మాననీయ మైన మల్లిక సహకార
కలిత యగుచుఁ జాలఁ జెలువుఁ గాంచె. ౭౯

సీ. రతిలోలలాట లాట రమణుల చెదరుటం
దఁపు ముంగురుల పూవుఁదావి బలిసి
కర్ణాట యువతుల గబ్బిగుబ్బలఁ బూఁత
బదనైన కస్తూరి వలపుఁ దాల్చి
చోళీకపోల పత్త్రాళి సుధూళిధూ
సరితమా నెమ్మేన సౌరు మీఱి
రతి ఖిన్నలైన యాంధ్రపురంధ్రుల రుటంపుఁ
జనుల చెమ్మట నీటిచాల్ హరించి
మరు పనుల మేల్వాలంతులౌ మాళవాబ్జ
వదనల విశాల జఘనబింబముల నొత్తి
తరలి గంధపుఁ గొండ నెత్తంబునుండి
మెల్లఁ జనుదెంచెఁ దెమ్మెర ప్రల్లదీఁడు. ౮౦

క. మున్నడి విరహులఁ గలఁపన్
గన్నుల విల్లెక్కువెట్టెఁ గంతుం డపు డా

మన్నిని కూఁతు నెమ్మది
చిన్నయుఁ గాంతోపభోగచింతఁ దెలిపెఁ. ౫౧

తే. అంత శృంగారశేఖరుఁ డనుగుపట్టి
యైన వాసవదత్త స్వయంవరోత్సు
కత విని సమస్తభూపాల కలితవసతు
లైన నృపతుల నొకచోటునందుఁ గూర్చె. ౫౨

సీ. దగ్ధకృష్ణాగురుధూపము నూన్నసూన
కీమత్ కేవలాకృష్టములగు
నళులు పెల్లొనరించునట్టి ఘుంఘుమరవ
మున దిగంతములు మార్మ్రోయుచుండ
నత్యంత రభస హాసామోద విభవంబు
గగన భూవలయంబుఁ గ్రమ్ముకొనఁగఁ
దత పరిహాస కథా వ్యాహృతి విదగ్ధ
శృంగారమయు జనుల్ చేరియుండ
భాసిలుచు సర్వధారుణీశ్వర కృతోప
వేశమైన స్వయంవరోద్దేశమునకు
రాజ మిూఱఁగఁ దెచ్చిరి రాకొమరిత
రాజు నానతిఁ బౌరపురంధ్రు లపుడు. ౫3

ఆ. ముఖ్యనంది ఘోష ముఖరితాశాంతర
మఖిలలోక విస్మయావహముఋ

తనరు విజయసమరమును వలె నొక హైమ
మంచ మపు డలంకరించెఁ దన్వి. ౫౪

క. ఒక్కమొగిఁ గ్రమ్మె నబ్బిడ
చొక్కపుమై రాజసుతుల చూపులు వలపుల్
మిక్కిలి విరి తామర నడి
చక్కటి వలఁ గొన్న తేఁటిచాల్పు లనంగన్. ౫౫

సీ. ఆయిందువదన మంచావిష్టుల న్నృపాల
సుతుల నొక్కొక్కరిఁ జూచిచూచి
రక్తకాదయ్యో నా యుక్తమదెట్ల న
నయ్యుమ స్వాయమ తాశ్యామ కావె!
కంఠీరథము డిగ్గి కమలదళేక్షణ
చనియె నప్పుడ నిజసదనమునకు
నారేయిఁ గలఁ గాంచె సొంగు సంగజుఁ బలె
నొసపరియగువాని నొక్కతరుణుఁ
బుణ్యసింధురూపముం బలెఁ దుంగభ
ద్రయగు నాస నర్మదయగువాణి
మాలిని యగు కబరిమానితస్వార్వాహి
ని యగు కీర్తి నెనసి నెగడువాని. ౫౬

సీ. శృంగారతరుమూల, మేకాయతనము ల
క్ష్మీ సరస్వతులకుఁ, గేళిగృహము

కాంతికిఁ, గోశనిశాంతంబు లావణ్యా
ధనమున, కిల్లు వైదగ్ధ్యమునకు,
గుణరత్నములకు రోహణగిరి, ప్రభవాద్రి
యంగజగాథాతరంగిణులకుఁ
జక్కనకాదర్శ, మిక్కువ సౌశీల్య
సంపదలకుఁ, బాది చదువులనెడు
లతలకుం, గ్రీడికిఁ గుతుకాలయము, నగునృ
పాల సుతురూపుఁగాంచి స్వప్నగతే యయ్యుఁ
దరుణి యబ్బురపడుచుఁ జింతామణీ నృపు
తనయుఁ గందర్పకేతుగాఁ వినియె నంత. ౫౭

ఆ. కూరు కుడిగి నిరత మూరాజసుత రాజ
సుతవలోక దుర్లలితయయి కడు
దూపటిలెడు మెయి మృదులశయ్యఁ బవళించి
తన మనంబులోనఁ దలఁచె నిట్లు. ౫౮

తే. మదనుఁడా, వాని కంగమ న్నాట కలదె
అశ్వినీసుతుఁడా, యతఁ డద్వితీయుఁ
డట్లుఁ గాకున్నఁ దొలిబామునం దొనర్చి
నట్టి నాపున్నె మిటుఁ గాంచనయ్యె నొక్కొ! ౫౯

తే. కమలగర్భుండు నిజ శిల్పకౌశలంబు
నంతయును వీని నిర్మించునపుడ చూపె

నని తలంచెదఁ గానిచో నసదృశమగు
కాంతి యీతనికే యిటుఁ గలుగుటెట్లు? ౭౦

సీ. నలు హేతువైన భీమనరపాలతనుజాత,
కాఱడవుల వృథా కష్టపడియె
నాభోజసుత మహిషీభూతయయ్యును
రమణమీఱ నజానురక్తయయ్యె
నల శకుంతలయు దుష్యంతుఁ గూరిచి వ్యర్థ
మట్టె దూర్వాసుచేఁ దిట్టుఁ బడియె
స్నిగ్ధోరు సంపద్విజితరంభ రంభ తా
నలకూబరకుమారుఁ గలయఁ గోరె
బుద్ధి హతబుద్ధి కొఱమాలియే ధనదునిఁ
గరము గోరుకొనెఁ స్వయంవరమునందు
ముగ్ధ కావె పులోమజ మోహ ముంచె
నకట! వృద్ధశ్రవునిపై నిరర్థకముగ. ౭౧

తే. ముదిత మది నిట్లు దలంచు నదియు నెల్ల
కడల కతిదీనదృష్టుల విడుచునదియు
నోర్వఁగా రాని వలవంత నొందునదియు
నకట! విరహాబ్ధి మునిగెడు నదియు నయ్యె.

ఉ. పండినదానిఁ బోలి యెడ
బాఁటను కుమ్మిన నవ్యపుష్ప కో

దండ దవోపగూఢవలె
 దారుణ చైత్ర మహానలోజ్జ్వలా
ఖండ శిఖాచయ గ్రసిత
 గాత్రవలెన్ మలయాచలాలయో
ద్దండ సమీర రుద్రసము
 దగ్రరుషాగ్న్యవలీఢయో యనన్. ౬౩

సీ. అవిరతోన్మాద భూ నివసథాంతః పతి
 తయుఁ బోలె శూన్యేంద్రియయును బోలె
వర్తిలుచుండి భావమున లిఖితుఁ బోలె
 నుత్కీర్ణుఁ బోలెఁ బ్రత్యుప్తుఁ బోలె
నాత్మఁ బ్రవేశించినట్టి వానివలె మ
 జ్జా శబలితుఁబలె, సతత కీలి
తునివలె వజ్రసార నికామ ఘటితుని
 బోలె రక్తాశయంబున ద్రవంబు
గా నయిన వాని వోలె ముఖ్యంబు గాఁగఁ
బలల సమ్యగ్విభక్తుఁడౌ వానివలె మ
నంబునందుఁ దలంచెఁ గందర్ప కేతు
దర్పకుని పీడఁ బడి యలతరుణి యపుడు. ౬౪

సీ. ఉన్మత్తవలె నంధయుంబలె బధిరయుఁ
 బోలె మూఁగతనంబుఁ బొంది నదియు

బలె శూన్యంబో లె నవా స్తేంద్రియయుఁ బలెఁ
దద్ద్యంబుఁ బట్టిన దాని బోలె,
యావన్నద్భ్యను నబ్ధియందుఁ జలించెడు
తరగలచేఁ బరీతయును బోలె,
దర్పకశరకీలితయుఁ బలె, రాగంపుఁ
ద్రాఁట సంబద్ధయా దానిఁ బోలె
విహిత శృంగార భావనా విసరసాతి
శయ సమాఘూర్ణి తాఖిలావయవఁ బోలి
మరుని సెగ కోర్వలేక యా సరసిజాక్షి
యిష్టసఖులఁ గనుంగొని యిట్టు లనియె. ౭౫

సీ. అనుఁగుం జెలియ! హాయనంగ లేఖా! వెసఁ
గీలింపు మెదనీదు కేలుఁ దమ్మి
సంసేక మొనరింపు చందన రసమున
మదనమంజరి! కుచమండలంబు
విడఁ బారునాను క్రొమ్ముడి నిదే ముడువుమీ
చక్కఁగా సరళ వసంతసేన !
మొగలి పూవుల రజంబును జల్లుఁ దరళ త
రంగవతీ! మదీయాంగకముల
మదనమాలిని! వీవుమా మంజుశైవ
లావళులఁ జల్లఁగాఁగ నాయవయవములఁ

చిత్రపటమున వ్రాయుమా చిత్రలేఖ!
చిత్తహారణునిఁ దరుణు విచిత్రవర్ణ. ౬౬

మ. కలయన్ గాత్రములన్ విలాసవ
త్తాచూర్ణముం జల్లుమా
యెలమిం గప్పుము రాగలేఖ! చనుదో
యిన్ దమ్మిపూరేకులన్
నెలఁతా! కాంతిమతీ! సుకాంతి! తుడుక
న్నీర్బొట్టులన్ యూధికా!
లలి రంభాదళతాళవృంతముల మె
ల్లన్ గాలిరా వీవుమా. ౬౭

తే. చెలులతో నిట్లు బహువిధంబులుగఁ బల్కు
నదియునై సొమ్మసిల్లె నయ్యంబుజాక్షి,
పరిజనంబులచే నొనర్పఁబడు శీత
లోపచారములన్ దెలివొందె నపుడు. ౬౮

సీ. సమ్యక్ శిశిర ఘనసార సారరసాకు
లాపగా పులినంబునందు క్షణము,
అధిక శీతల మలయజ రసమయధునీ
హారి తటప్రాంతమందు క్షణము
అరుణకాంచన సరోజాంచ[illegible] నీర
సలలిత చందనచ్ఛాయ క్షణము

అలస సమీర సంచలిత పళ్ళోల్లస
త్కదళీవనాంతరస్థలుల క్షణము,
కోమలములైన పూవులఁ గ్రొంజివురులఁ
జక్కఁ బఱచిన పాన్పులం దొక్క క్షణము
పద్మినీ సంస్తర తుషార భార శైత్య
యుతములౌ మేటి రాలయం దొక్క క్షణము. ౬౯

తే. ప్రళయసమయ సముద్భవ ద్వాదశ రవి
కరకలాపాతి తీవ్రమై కరము మెఱయు
ప్రబల విరహాగ్ని గడపె నా రాజతనయ
పరిజనంబులతోడ నా తరుణమందు. ౭౦

సీ. క్షీరాబ్ధితెరవోని చిఱునవ్వులయు మోవిఁ
బసమీఱి చెలువొందు వానిమోము
పాలుపొందు ద్విజకులంబువలె శ్రుత్యంత సం
గ మనోజ్ఞమగు వాని కన్నుదోయి
ఆనన నైసర్గికామోద మెల్ల మూ
ర్కొనఁ గోరునదివలెఁ దనరు, దూర
నిర్గతమై జగన్నిత్య మోహాకరి రా
జకుమారు నాసా ప్రసన్నలక్ష్మి
అమలచంద్రకళా కోమలామృతాచ్ఛ
ఫేన సుశ్రీవిశేషంబు వెల్లడించు

వింతయగా వాని సుస్నిగ్ధదంత పంక్తి
పంచశరు నేఁపుఁ గొననోపు వానినవ్వు. ౭౧

తే. ఎవ్వి యీతనిచే నలంకృతము లగునొ!
అవని నవ్విషయములె ధన్యంబు లాస్థ
లములె సుకృతాతిశయసముల్లాసగతులు
ఆ యభిఖ్యాత్కరములె పుణ్యాధికములు. ౭౨

చ. అని మదినెన్ను చిట్టటుల
నాకొమ కన్గొనుచుండె వాని మి
న్నున లిఖితుం బలెన్ దన క
నుంగవ బింబితుఁబోలెఁ జిత్రమం
దునఁ గనుపడ్డవానివలెఁ
దోడి చెలుల్ నృపసూతి భావ మి
చ్చ నెఱుఁగఁ బంపి రప్పడఁతి
శారి విదగ్ధఁ దమాలికాభిధన్. ౭౩

క. ఎడతెగని గతుల నీయది
కడువడిఁ జనుదెంచె నన్నుఁ గలసి ప్రియా! యీ
యెడ మ్రాన్క్రిందఁ గనుమని
యొడికంబుగఁ బల్కె కీర మూరకయుండెన్. ౭౪

క. అంతయు విని నృపతనయుం
డంతన్ ద్వర లేచి దాని నటుఁ బిలిచి నిజో

దంతము నిఖిలముఁ దెలిపెఁ
సంతోషంబున విముక్తసంతాపుఁడునై. 25

ఆ. అంత శారికయు ధరాధిపసూతికి
వినతిఁ జేసి జాబు విశదపఱుప
హర్ష వార్ధిమగ్నుఁడై మకరందుండు
కౌతుకంబు మీఱఁగాఁ బఠించె. 26

తే. "ఎపుడుఁ గామిని ప్రత్యక్ష దృష్టభావ
యయ్యు నస్థిరహృదయయే యానుగాదె!
స్వప్నసమయానుభూతభావ యగు యువతి
వారక దృఢీకరించునె ప్రత్యయంబు." 27

సీ. అద్దాన లిఖితమైనట్టి యీ పద్యంబు
హర్ష ప్రపూర్ణుఁడై యాలకించి
అమృతార్ణవనిమగ్నుఁ డైనవానివలెఁ గం
దర్పకేతుఁడు తన్నుఁ దలఁచె నపుడు
చక్కఁగా బాహువుల్ సాఁచి యా గోరవంకఁ
గడు గారవంబునఁ గౌఁగిలించి
శారికా! నా ప్రియ యేరీతి నుండెడు
నే మొనరించు నేమేమి పలుకు
ననుచు వాసవదత్త వృత్తాంత మఖిల
మాదరాయత్త చిత్తుఁడై యడుగు చాత

మాలికం గూడి రేయి రాచూలి యచట
జరిపి పయనించెఁ బ్రియమిత్రసహితుఁడగుచు. ౭౮

తే. అంతలో మధ్యమ జగంబు నవతరించె
స్వీయముగా నీయుదంత మంతయును వెలుపు
తలఁపునం బోలె లోకబాంధవుఁడు తరణి
సమధిక ధ్వాంత సంతతి క్షపణుఁ డగుచు. ౭౯

ఆ. అంతఁ దిగ్మఘృణిరథాంగమనోవీథిఁ
దవిలికొన్నయట్టి తాప మట్లు
మందిమంబుఁ దాల్చె మందారవృక్షమ
హా గుళుచ్ఛ సుందరాకృతిఁ దగి.

సీ. దిన తామ్ర చూడ సందీప్త చూడా సుచ
క్రాకార రామణీయకముఁ దాల్చి,
సిందూర రాజి రంజిత సురప్రభు మద
ద్విరద కుంభంబుతోఁ దీటుఁ బూని,
నృత్త చలత్ కపర్ది మకుటీ దృఢ బద్ధ
ఫణిరాజ కర్ణికాప్రభ వహించి,
సంధ్యాంగనామణీ సరస యావక కృత
పత్రలేఖాద్యుతిఁ బరిఢవిల్లి,
పృథులతరకాల కరవాల కృత్త దివస
మహిషరాట్స్కంధ వలయ సమత్వమూని,

పద్మినీవల్లభుఁడు లోకబాంధవుండు
భానుఁ డపరమహాంబుధిలోనఁ గ్రుంకె. ౮౧

సీ. వృక్షసంచయము మూరపిచుకల జగడాల
రొదల నిండినయట్టి తుదలఁ జెలఁగె
గణికాగణము గాఢకౌతుక విరచిత
కందర్ప ముద్రతోఁ గడు రహించె
నాశ్రమసవిధభూజాళి కాపేయ వి
హ్వాల మర్కటచ్ఛటా కలిలమయ్యె
ముదిమ్రాఁకు కోటరంబులవసియించు గూ
బలగుమి మెలమెల్లఁ బయలుదేరె
నఖిల చిత్తహారియౌ మనోజుఁడు విలు
మొరయఁజేసి శరనికరముఁ గురిసె
గృహమయూర సమితి కృతయష్టికా సమా
రోహలీల నపుడు రూఢిఁగాంచె. ౮౨

క. సంజ దగ గగన హర్మ్యస
మంజన మాంజిష్ఠ రాగ మహితారుణ భా
మంజుల శిఖరధ్వజ మనఁ
గంజాతాప్త్రరథ హైమ ఘనకేతువనన్. ౮౩

మ. వెలసెన్ జీకఁటి యంతటన్ దరుణతా
పింఛద్యుతిన్ స్త్రైణ కుం

తల సంస్కార సుధూప మాంసలితమ్మై
దంతావళ శ్రేణికా
విలసద్గండ గళన్మదాంబు కణ సం
వృద్ధంబునై రాత్రి తా
య్యాలికిన్ మేలి ముసుంగునై సరవు మా
డై వృద్ధవేశ్యాళికిన్. ౭౪

తే. ఎలమి భువనత్రయంబు జయించునిచ్చఁ
బయనమగుచున్న పూవింటివానికి రతి
హస్త కీర్ణము లయిన లాజాంజలులనఁ
జొక్కమగు మింటిపైఁ బొల్చె రిక్కలపుడు. ౭౫

క. ఇనుఁ బాసి దూపటిలు ప
ద్మిని మనమువలెన్ రథాంగ మిథునం బెడసెన్,
బెనుపొందె శార్వరంబగు
ఘనతమము కపర్ది కంఠ కాళిమ మెప్పన్. ౭౬

సీ. భువనత్రయము గెల్వఁబూనిన యతనుని
ప్రస్థానపూర్ణకుంభం బనంగ
ప్రాచీవధూఫాలభాగ ప్రక్లిప్తమై
పొలుచు మంకెనపూవు బొట్టనంగ
నుదయాద్రి శృంగమం దొప్పు మందారంపుఁ
గుసుమంపు మవ్వంపు గుత్తి యనఁగఁ

కుంకుమపుం బూఁతఁ గొమరొందు నింద్ర ది
  గ్వనజాక్షి నునుగుబ్బ మొన యనంగ
రేయి రాకన్నె చేబంతియో యనంగ
నలుపు విల్కాని బంగారు టద్దమనఁగ
గగనసౌధ మహాహేమకలశమనఁగ
డంబు మీఱుచుఁ జంద్రబింబంబు వొడమె. ౮౭

క. అనువుగ సంవాదంబులు
పనుగొనె నా సమయమందు స్వైరిణు లెల్లన్
బనివడి పనిచిన దూతీ
జనములకుఁ బ్రియతములకు సరసస్ఫూర్తిన్. ౮౮

ఆ. అలరె నపుడు జగము తెలిదీవి నడుమ నుం
డెడు విధానఁ బాలకడలి మునిఁగి
యుండునదియు వలె మహోన్నత స్ఫాటికా
యతన మందుఁ జొచ్చినదియుఁ బోలె. ౮౯

సీ. విప్పుచూపెడు రేకు దొప్పలు గల కుము
  దముల మధుకణాళిఁ ద్రావి కేరు
మొకరి తుమ్మెదతండముల కలకల నినా
  దమున మ్రోఁగెడు దిగంతములు కలిగి
వెలుచ వెన్నెలఁ గ్రోలి యలసియున్న చకోర
  దంపతులకుఁ జాల నింపుఁ గూర్చి

సురతఖిన్న పుళింద సుదతుల చెమ్మట
నీటి బొట్టులదోఁచు నేర్పు లెఱిఁగి
మలయ పర్వత భవ మృదు మారుతంబు
మలయుచుండెఁ దమాలిక నెలమిఁ గూడి.
చనియె వాసవదత్త ప్రోలునకు, సఖుఁడు
ప్రీతిఁ జను దేరఁ గందర్పకేతుఁ డపుడు. ౯౦

ఆ. నగరిఁ జొచ్చి భవతనయుఁ బోలు నృపసూతి
రాజ దుహిత భవనరాజముఁ గనె
నిఖిల భువన రామణీయక మొక్కచోఁ
బొందుపడిన పగిదిఁ బొలుచుదాని. ౯౧

సీ. మృదుపవమాన కంపిత నభోద్రుమ సుమ
మంజరుల్ వోలె వ్యోమపురలక్ష్మి
నదలించునవివోలె నమరు పతాకికల్
గలదాని, శిఖర సంగతములైన
ముత్తెములకన్ మిషఁ బత్తనయువతులఁ
గాంచవచ్చిన యుడుగణముఁ దాల్చు
నవి వోలె నలరారి యనుపమానములగు
ప్రాసాదములఁ బొలుపారుదాని
బహుళ కృష్ణాగురు సుధూప పటల దర్శి
తాసమయ మేఘసన్నాహమైనదాని

సురుతర మృదంగ నిస్వనావహూత మోద
బర్హిణ ప్రచయంబునై వగలుదాని. ౯౨

ఆ. కౌతుకౌఘమునకు ఘననిధివలె విభ్ర
మావళులకుఁ గల గృహంబువోలె
మరుని కొల్వువోలె మంజిమమునకు సు
తృప్తిపదమువోలెఁ దనరుదాని. ౯౩

తే. చెలి! ప్రధావించెదవు ద్రవసిద్ధికిపుడు,
యీచపల చపలాయితయౌచు నేల
ననభిహితయయ్యెఁ బర్వెడుః నలరుగుత్తి
ముగుద! నీచెవి తుదనుండి దిగువఁబడియె. ౯౪

తే. సురయ సురయాచితయునయి సొంపుమీఱు
శ్రీవి సకపోలరేఖ సురేఖ నీవు
సలిచెదవు మత్తమూరునిఁ గలహామందుఁ
గమ్రకల హేమకాంచికా క్వణితఫణితి. ౯౫

తే. ఇష్టసఖి! మలయా! మలయేప్సితాప్తి
దృగ్విలాసంబునవె కంటిపీవు దాని
నల్పునూ కొమ్మ నాగపుష్పములు చిదుమఁ
బడుదునని సిగ్గిలెమఁ దొట్రుపడుచు నిచట. ౯౬

ఆ. ఓ యనంగలేఖ! నీయంగమతను శ
రాళిహతులఁ దాల్చినట్లు తోఁచె

చెలియ విహితమగుచు వెలయు నీ వక్త్రాక్షిక
హారలతిక విహితమయ్యె నీకు. ౯౭

ఆ. లీలమీఱు ముక్తావలిక సోత్కావలిక కన్ను
దామరల వెలుంగు మోముతోడ
సాటివచ్చు నో కొమ్మ! సంపూర్ణ పూర్ణిమా
చంద్రుఁడైనఁగాని సరవిఁ జెపుమ. ౯౮

తే. సఖి! సతీవ్రతమీఱు నీస్వాంతమందు
నెవఁడో? పురుషుఁడు గలఁడనియే దలంతు
సకియ యనుభూతములుగదా! శతవిధముల
వజ్రసారములైన నీపలుకులెపుడు. ౯౯

తే. లలిత కేరళికా! సవిలాసరీతిఁ
గాంచెఁ బో కరకాకర కాలమేఘ
ఖండ సామ్యంబు నీరమ్య కచకలాప
మమలవికసిత మల్లీస్ర గాకలితము. ౧౦౦

తే. కుంతలిక కుటిలాసిత కుంతలిక ల
సత్ పురీ గోపురాళి గోచరములగుచు
వినఁబడవు కర్ణమధుర గంభీరములయి
నెరయు మంజులసంగీత నిస్వనములు. ౧౦౧

తే. సురత! సురతవేళ సుకుచ తాడనజంబు
నతనుతాపహారియగు సుఖంబుఁ

గుడిచి దానిఁ దలఁచుకొంచు స్తనజ్జనుఁ
డైన యెవని నెడయుదానవైతి. ౧౦౨

క. స్మరజనిరజని నిశాత స
ఖరముల నఖరములఁ బీడఁ గల్పించెఁగదా
కురుతమునకు బతిరమణీ!
తరుణీ మండలిని ధన్యతమ వీవె సుమీ! ౧౦౩

రగడ. సమకూరుపుము కురంగి! కురంగమ
శాబంబులకు దూర్వాంకూరము
రమణీ! కిశోరిక! రమణీయ కిశో
రముపయిఁ జూపుము శ్రద్ధాయోగము
త్వరఁ గృష్ణాగరుధూపపటలము
ద్దామతఁ గర మొలయింపుము తరళిక!
వర కర్పూర రజోవ్రజమునఁ గుచ
భారంబును బూయుము కర్పూరిక!
మాతంగిక! కమనీయంబగు నీ
మాతంగార్భకగతి గమనింపుము
నూతనముగ శశిలేఖా! నా నె
న్నుదుటను శశిరేఖను లిఖియింపుము
సకి! కేతకీకా! దోహలమున నిట
సంకేతింపుము గేదఁగి పూఁబొద

శకునిక! యిదు మాహారముఁ గ్రీడా
శకుని శిశువులకుఁ గడువేగంబుగఁ
జరియింపుము యీమంజులతర కుం
జమున మదనమంజరి! క్షిప్రంబుగ
విరచింపుము శృంగార వినిర్మితి
వేగముగా శృంగార సుమంజరి!
వెన్నెల పులుగుల కిమ్మా సంజీ
వినికా! నీ వీమరిచ దళంబును
కన్నె! మదనలేఖా! మరు జాబునుఁ
గడువడి వ్రాయుము మలయానిలునకు
మకరాంక విశోభిత! మకరిక! తా
మరతూఁ డంచనిసుంగున కొసఁగుము
అకలంకమతి! విలాసవతీ! నీ
వాడింపుము చంద్రకిపోతంబును
ప్రాంచన్మలయజ పంకంబున గృహ
వాటంబు దమాలిక! తగ నలుకుము
కాంచన మండపమందునఁ జల్లుము
కాంచనికా! మృగమదజలకణముల.౧౦౮

చ. ఘనుఁడగు నెయ్యునిం గలసి
కాంత గృహంబును జొచ్చి తత్సఖీ

జనులు పరస్పర ప్రణయ
చారు మృదూక్తుల వించు రాజనం
దనుఁ డసమాస్త్రి మోహాకళ
నా ననవద్య శుభాంగి లోకమో
హానకరరూప విభ్రమ స
మన్విత రాసుతఁ గాంచె నచ్చటన్.౧౦౫

తే. వనిత విస్ఫారితాక్షిఁ గ్రోలు నృపసూతి
తెలివిఁ గొనె సౌమ్య దయితు తాదృశ మనోహ
రాకృతిం గని చొక్కెఁ దొయ్యాలియుఁ దేటి
తొండురుల్ సఖు లొనరించు నూడిగముల.౧౦౬

తే. ఇరువు రొక యాసనమ్మున నెలమి నుండి
రతిమదనులో యనంగ విరాజిలంగ
ననియె నిట్లు కలావతి యనెడు నొక్క
బ్రాఁతి చెలికత్తె కందర్పకేతుతోడ. ౧౦౭

తే. నూత్న విస్రంభగాథా వినోదగోష్ఠి
సేయఁగా నీ యదను సముచితముగాదు
గాన నిపు డార్యపుత్త్రి! యిక్కడి విధంబు
లఘుతరంబుగఁ బల్కెద లలిత ఫణితి. ౧౦౮

తే. ఓ నయాంబుధి! నీకుఁగా నొఱపుఁ దక్కి
యెంత కాఁకయుఁ గుడిచెనో! యీ లతాంగి

శేషుఁడే చెప్పిదేని సశేష మగును
వానిఁ దెలుపఁగ నే నెంతదాన నిఁక. ౧౦౯

తే. స్వర్గరాజ్యోపమానమౌ ప్రాజ్యరాజ్య
మును కటా! విడనాడితి వనఘ! నీవు
పెక్కు మాటల నేమి యీ వెలఁది యాత్మ
భృశ విశంకట సంకటావిష్టమయ్యె, ౧౧౦

సీ. విజయకేతుండను విద్యాధరేశిత
గెలుపులెక్కము వాఁడు గలఁడు వాని
కొకతనయుఁడు సనయుఁడు పుష్పకేత్వాఖ్యుఁ
డుండు మకరకేతు నోలుపు నగుచు
నింతకు ముందుగా నీకన్యఁ దారుణ్య
సమతిక్రమాత్యంత చకితుఁడైన
తాతయు వేగ నాతనికే వారంబున
నిచ్చునట్టుల నిశ్చయించుకొనియె
మాననీయుఁడవైన నీకే నుడివిన
దానిలో నెవ్విధముగఁ దేజో నిధాన
యింపు నింపునో యటు సేయ నిపుడు వేగ
పడుమ! యని యూరకుండె నావడఁతి యపుడు.

తే. అంత శృంగార శేఖరు సనుఁగు పట్టి
భూరి శృంగార భూభామినులలామ

ద్వైన వాసవదత్తతో నాన్నృపాల
సూతి మంత్రణఁజేసి యా సుందరాంగి. ౧౧౨

తే. మారుతము నా సదాగతి మానసగతి
యంచనానిందు సమధామ మపహసిత మ
నస్త్వరా భూమము మనోజనామము నగు
తేజిపై నిడికొనిపోయెఁ దేజుమీఱ. ౧౧౩

ఆ. వార్త లెఱుఁగు కతన వసియించు మకరందుఁ
డా పురంబునందె యంతఁ గ్రమము
గా నృపాలసుతుఁ డనూన తేజముగ
వ్యాతి మాత్రమార్గ ముత్తరించి. ౧౧౪

సీ. సతత మనుష్యమాంసగ్రసనాకుల
కంకకులాత్యంత సంకులాగ్ర
మతివికట కట సమ్యక్కబళన కటు
రవకటపూతనార్భటకలితము
నుల్కాముఖ ముఖసముజ్జ్వలవిసర జ్వా
లన ఘనార్చిర్జటాల నికటంబు
విచలత్ పిశాచాళి విరచిత కుణప వి
భాగోత్థ కలకలధ్వనియుతంబు
కర్కశార్ద్రసిరాకౌతుకప్రభూత
యుగ సమావేష్ట్యమాన చిత్యుగ్రకీల

శవదహన దహ్యమాన భ్రుశస్ఫుటిత వి
క్రుత తరరటన్నరకరోటి కీర్ణతలము. ౧౧౫

సీ. చాల విస్త్రృతమౌ శ్మశానవాటము దాఁటి
నిమిషమాత్రములోన న్నృపతి సూతి
చొచ్చె వింధ్యాటవి సుమహతి నేకంత
దంతుర ప్రాంతమై తనరుదాని
ప్రళయోద్భవపు వేళవలె సంప్ర వృద్ధార్క
సముదయాకలితమై యమరు దానిఁ
దత సుర సభనా స్వతంత్రస్థ కౌశిక
కౌతుకసీమయై క్రాలుదాని
సత్పుతుష సేవనయుఁబోలె సతము శ్రీఫ
లోదయ సముల్లసితమయి యొప్పుదాని
ధార్మికుని సిరివోలె నెంతయు నశోక
సరళ పున్నాగ మగుచుఁ బ్రజ్వరిలు దాని. ౧౧౬

తే. అపుడు పువ్వుఁబోలె మెత్తనివైన మేను
లమర దూరాధ్వగతి కృతాయాసభరము
తోడఁడీల్పడ్డ రాజ పుత్త్రునకు రాజ
పుత్రికిని నిద్దురను మాసిపోయె రేయి. ౧౧౭

తే. అంబరమహాసరోవరమందు రాత్రి
తరి నెలవు కొల్పుకొని తద్దఁ దనరు సమయ

ధీవరునిచేత నంతటఁ జిరుగుబుత్తు
మత్స్యతతియ త్తఱిఁ బ్రహీయమాణమయ్యె. ౧౮

ఆ. తిరుగఁజొచ్చె నరుణకిరణ చూడాచక్ర
హారి యగుచు దివసమనెడు కోఁడి
తారకా విశేషతండుల భరితమై
రంగుమీఱు పుష్కరాంగణమున. ౧౯

క. ననుఁగూడి ప్రవృద్ధతఁ జెం
దిన యీద్విజరాజు వారుణీసంగంబుఁ
గని పతితుఁడయ్యెనని న
వ్వెనొ నాన్యైంద్రియగు దిక్కువిమలతఁగాంచెఁ.

చ. అరుణహరిన్నఖాగ్ర దళి
తాంధతమః కరిరక్త ధార నా
హరిఖురదారితోవయ న
గాంబుజరాగ సుధూళిఁబోలెఁ బ్రా
గ్ధర శిఖరంబునం దనరు
దానవపుం బువుగుత్తికాంతి నా
హరిహరి దద్రిగైరిక ఝ
రాంబుల నాఁదగె బింబమెత్తనై. ౨౧

సీ. పొదుపుగుబ్బలియను బెడఁగారు చిల్వామేల్
పడగపై నొప్పు మవ్వంపు మణియొ?

వియదింద్రనీల పృథ్వీరుహాంబునఁ జాలఁ
జెలువొందు నూత్నంపుఁ జివురు కెంపొ!
తొలిదిక్కుఁ జెలి నెన్నుదుటఁ బ్రస్ఫుటంబుగాఁ
గొమరారుచున్న కుంకుమపు బొట్టొ!
తోరంపు వినువీట తూర్పువాకిటనుండు
నిండుమీఱు పసిండి కుండ యేమొ!
సంజతీవియఁ బూలుచు పుష్పంబొ! వికస
లలితమగు పట్టసూత్ర గోళకమొ! ప్రాచి
కాంచి సంధ్యారుణ గుణ సమంచిత మయి
నలువుమీఱెడు పైఁడి దీనారమేమొ! ౧౨౨

తే. సార పూర్వాద్రిధాతు రాగారుణ మగు
దిగ్గజేంద్రాంఘ్రియో యనఁ దేజరిల్లి
కారుకొని క్రమ్ముచిమ్మచీకటులఁ జోపి
అబ్జినీబాంధవుం డుదయంబునొందె. ౧౨౩

క. బలు నింగిమేడముంగిట
నలికిన కుంకుమరసంబొ! యనఁగా భిన్నో
జ్జ్వల విద్రుమ శోణరుచిన్
నలువై లేయెండ ప్రాఁకె నాల్గుదెసలకున్. ౧౨౪

తే. ఉజ్జ్వలములైన దివస కాంతోపలముల
సంగమునఁ బోలె వేఁడిమి చాల హెచ్చె

నల త్రయీ మూర్తి భగవంతుఁడై వెలుంగు
వేఁడివేలుపుదొర జగా వెలుఁగులందు, ౧౨౫

మ. వెతమీఱన్ వల కాఁక నెన్నియొ నిశల్
వేఁగించుటన్ భోజన
వ్యతిరేకంబున నైక యోజనపథా
యాసంబునన్ రాసుతుం
డతిగాఁగన్ వివశాత్ముఁడై సులభని
ద్రాక్రాంతి గుంజ న్మధు
ప్రతమా పూఁబొదఁ గూర్కె నత్తఱి విని
ష్పందేంద్రియ గ్రాముఁడై. ౧౨౬

తే. తరణి కర నికరానూన తప్యమాన
వల్లరియుఁ బోలె మిక్కిలి వాడు వాఱి
తనరు వాసవదత్తయుఁ దనయనుంగు
దయితునిం గూడి నిదురించెఁ దత్తలమున. ౧౨౭

మ. అనిశోద్భ్రాజిత కల్పకంబువలె స
ర్వాశాంత సమ్యక్ప్రసా
ధనుఁడౌ దేవుఁడు వెల్గురాయఁడు ఖమ
ధ్యస్థాయిగా నిద్రమే
ల్కాని కన్విప్పుచుఁ గాంత పూఁ బొదరునన్
గన్పట్టమిన్ జేరెఁ బొ

క్కన నొండెద్దియొ దుర్విభావ్యమగు ది
క్కునఁ రాసుతుం డక్కటా! ౧౭౮

చ. క్షణము ద్రుమభూములన్ క్షణము
సాంద్రలతావళి నన్ని దిక్కులన్
క్షణము క్షణంబు బూఁ బొదల
సార సరస్తటులన్ క్షణంబునన్
క్షణముచలత్ ప్రశుష్కదళ
సంచయమందు వియోగవహ్నిఁ దత్
క్షణము దపించి రాసుతుఁడు
చాల భ్రమించె విలాపయుక్తుఁడై. ౧౭౯

ఉ. హా! సుదతీవిభూషణమ!
హా ప్రియ! వాసవదత్త! హా జగ
ద్భాసురసారభూత! దయి
తా! యెటకేగితో? నన్నుఁబాసి ర
మ్మా సఖి! కాంచుమా యతి దయా
ర్ద్రసుశీతల పూర్ణదృష్టి ని
న్నే సతమెన్నుచుండు నను
నేలుమ! నా నెపమేమొ తెల్పుమా!

చ. చెలి! యిఁకఁజాలు గేలి యెటఁ
జెల్వఁపుఁ దీవల డాఁగితో? వితా

యలిగితివేల? చూపు మిపు
డచ్చపు నీ ముఖచంద్రబింబమున్
గలికిరో! నీకు నేఁబడిన
గాటపుఁ బాటులనెల్ల నంతఁగాఁ
బలుకఁగ నేల? యన్నిటికి
వారక నీవె ప్రమాణమౌదుగా. ౧౩౧

క. హా! నెచ్చెలి! మకరందా!
ప్రాణపద! యనుగ్రహింపుమా నీవైనన్
ఈ నిరపరాధి జను న
న్నానిన విధి దుర్విలసిత మకటా! కనుమా! ౧౩౨

క. ఏమీ! నియతి విపాక మ
హా! మఱి కాలగతియును నహా! దుర్లంఘ్యం
బౌ, మిగులఁ దీక్ష్ణముగ నహ
హా! మలసెన్ గ్రహగణపుఁ గటాక్షం బిపుడున్.

క. ఇది చెడుకల ఫలమేమొ! వి
సదృశతఁ గల్గెనొకో! గురు లొసఁగు దీవనలన్
ఎది యగునో దానికి న
య్యెడనున గోచరుఁడు గానియతఁ డొకఁడున్నే!

క. గురుజనములం గొలువనో!
వరధేనూత్కారముఁ జక్కవలఁ గొననో! భా

సురవహ్నుల సేవించనో!
శరణ్యులకు నభయ మే నోసంగనో యెప్పుడును!

మధుమతి. పలువిధంబు లిటుల్
బలవరించు నతం
డెలుఁగెఁగా మదిలోఁ
దలఁచె నిక్కముగన్ ౧౩౬

సీ. నవ్యనళినళదనళినీ వకుళముఖ
సకలధాత్రీరుహా సాంద్రమగుచుఁ
జపల కపివ్రజ చలిత గళన్మధు
భరశీకరార్ద్రిభూభాగమగుచు
దక్షిణాదిజ్మారుత సుఖసంవాహితాం
చత్ పనసద్రుమశాఖమగుచు
దాత్యూహ కుహూకుహూధ్వని భరితాపగా
భూరితటీకుంజపుంజమగుచుఁ
గుక్కుటకుటుంబ వాసిత గురుతరాఖి
లావనీ జాతసముదయ హారియగుచు
నూత్నకంకేళిపల్లవానూన కాంతి
పూరపరిలిప్యమాన దిగ్వారమగుచు. ౧౩౭

తే. సతత శైలేయసురభిళాంచచ్ఛిలాత
ల సుఖనిద్రాణ శశశిశువిసర మగుచు

మహితసహాకార గహన రోమంథ కార్య
దుర్భరవ్యగ్రచమరసందోహమగుచు. ౧౩౮

తే. సలలితాసన్న కిన్నరీగళ సుగీతి
కా శ్రవణ సౌఖ్యహారిణానికాయ మగుచు
దంశకులదష్ట మర్కట తతిచపేట
పాత వినిహతకీటకవ్రాత మగుచు. ౧౩౯

క. కరమొప్పారెడు ఘనసా
గర కచ్ఛోపాంత భూమిఁ గడు దూరంబా
తెరువుఁగొని చనియె ధరణీ
వరతనయుఁడు శోకభర వివశమానసుఁడై. ౧౪౦

సీ. అటఁజని కనియె ధరాధిపసూతి చం
దనరస జహూచర్చిత జలమాను
షీ స్తనాకృతి విభాసిలు పెన్నురువుల నం
తట నొప్పమీఱెడుదాని, శకుని
కుల కబళన సమాకుల సమ్యగుత్పత
ద్ఘన నక్రచక్ర చంక్రమణ మగుచుఁ
గాలుదానిని, శరకరి మకరయుతంబుఁ
గలిత స్తిమిత తిమింగిల గిలాళి
మహితలహరీసమీర మర్మరిత సమధి
కాంచితోత్తాల తాల వనాంతర చరి

త్రోదక మనుష్యమిథునతత్త్వ్యపమ్ప్రదితల
సత్ప్రలినశైవలంబగు జలధి నెదురి. ౧౪౧

తే. అపుడుఁ జింతించెఁ నాన్నపాలాత్మభవుఁడు
దృష్టిగోచరమయ్యె ని ప్పీమహాబ్ధి
అపకృతి యొనర్చినట్టి దయ్యంబె యార!
యీకతంబున నా కుపకృతియె చేసె. ౧౪౨

తే. ఈమహాంభోధి విడిచెద నేను మేన
నాతురాత్మ ప్రహతి దోషమనియుఁ జూడ
సారమే లేని తుచ్ఛసంసారమందుఁ
జేయఁదగు పనినంతయుఁ జేయు నెవఁడు. ౧౪౩

సీ. ఎవఁ డేమిచేయఁ దూహింపఁగా ద్విజరాజ
హంయుమై గురుదార నపహరించె
నా పురూరవుఁడు బ్రాహ్మణధన తృష్ణాభ
రంబున నే వినాశంబు నొందె
విహితపురోహితదుహిత యయాతి యు
ద్వాహమై పడ కానిపాటువడియె
నెగపున శతమఖు నిల్లాలి నహుషుండు
కామించి కద! భుజంగత్వ మొందె
నరయఁ గలిచేత నభిభూతుఁడయ్యె నలుఁడు
గుత్సితుండయ్యెఁ గడుఁ బురుకుత్సనృపతి
బ్రాఁతికొడుకైన రాముని బాసి యీర్గెఁ
దద్ద నున్మదితుండయి దశరథుండు. ౧౪౪

సీ. జనుఁ డెవ్వఁడును జగంబున నిరవద్యుఁడై
కనుపట్టఁ డీనాఁడుఁ గానఁబడఁడు
కావున నిప్పు డీకాయంబుఁ దొరఁగెద
నే నని నృపసూతి నిశ్చయించి
కురర సంతతి కొనగోళ్లఁ జీలిచివైచు
మీనుతున్కలఁ గీర్ణమై నిరతముఁ
గ్రోష్టుకులోత్సృష్ట గురుకర్కటక కర్ప
రపరంపరావృత ప్రాంతమగుచుఁ
బుడమి నునుమించు టద్దంబుఁబోలె నీటి
తేని పటికపు నెలకట్టు జానుఁ దాల్చి
పొలుచు పులినతలంబును బూన్కిఁ జేరిఁ
పొలియఁగాఁ గడలిం బడఁ బోవునంత. ౧౪౫

తే. గ్రాహముల్ మకరములు నక్రములను గ్ర
హాన్వితంబులుగా నభయంకరములు
గాఁగ నక్రూరములు గాఁగ గగనపదవి
నుండి యొకవాణి యిట్టుల నుద్భవిల్లె. ౧౪౬

తే. ఆర్య! విరమింపు మరణప్రయత్నమీవు
సత్వరముగా మరలఁ బ్రియాసంగ మబ్బు
నీ కనెడు మాట నాలించి నృపతనూజుఁ
డా సమయమున మరణసాహసత మానె. ౧౪౭

తే. అంత నటునిటుఁ దిరుగుచు నానృపాల
సుతుఁడు దయితా సమాగమేచ్ఛుఁడయి యచట

నతుల ఫలమూలములఁ దనుయాత్రఁ గడఁకఁ
గడపుచును గొన్ని దినములు గడపుచుండె. ౧౪౮

తే. అప్పుడు వానకాల మవతరించె వియోగి
కాల మగుచుఁ దపసిలీలఁ గేవ
లము రజఃప్రసారశమనంబుఁ గావించి
విధృత జలద కరక విలసితమయి. ౧౪౯

తే. ఎసఁగె నపుడు మింట నింద్ర ధనుర్వల్లి
రత్నశుక్తి యనఁగ రతి నఖాళి
మార్జన కృతరత్నమయ శలాకయొ నాఁగ
నంగభవు విలాసయష్టి వోలె. ౧౫౯

క. అతితృష్ణా వేగవశ
స్థితి సలిలముతోడఁ గడలిఁ జెలువారెడు శం
ఖతతిం ద్రావి బలాకా
వితాన మిష వెలిచె నా దివిఁ దగె ఘనముల్.

తే. మహిత ఘననికషోపలమధ్యమందు
నీరదాగమమను హేమకారుఁ డొఱపు
వెట్టిన పసిండిరేఖనా వింటినడుమ
నొఱపుమీఱఁ దటిల్లేఖ మెఱసె నపుడు. ౧౫౨

క. పొలిచెఁ గరకోత్కరము
జ్జ్వాల మదన జిగీషువున కొసంగిన లాజాం
జలి నా ఘనఘట్టనమునఁ
గలిగిన వడిఁబడెడు తారకాతతివోలెఁ. ౧౫౩

తే. ప్రచుర లలితేంద్రగోప సంభరిత మగుచు
వఱలె నంతట నూత్న శాద్వలచయంబు
క్రమ లాక్షా రసాంక సంకలితమైన
భూవిలాసిని పయ్యెద వోలె నపుడు. ౧౫౮

క. ఘన కలశ జలంబుల నొ
య్యనఁ బ్రావృట్ప్రేటి జలక మాడించి భువిఁ
జను నంత శరచ్చేటిక
కన దచ్ఛాంబరముఁబూని క్రన్నన వచ్చెన్. ౧౫౯

సీ. అంత నేత్రింత లత్యంతంబుగా విశా
ల ద్రుమశాఖల రొదాళంబు సలుప
రమణ భ్రమించు కీరముల నాకులమైన
మఱిఁ గలహంసముల్ బఱిఁ జొరంగఁ
దీరంబు చేరువఁ దిరుగు సారస కుల
ముల రుతితో మేలి కొలఁకు లమర
నంతటఁ బ్రబలిన యట్టి శరద్వేళ
నృపసూతి కానఁ బరిభ్రమించు
చా చెలువఁ గాంచి విస్మితస్వాంతుఁ డగుచుఁ
గాటముగఁ గౌఁగిలించి యీ కరణిఁ బలికె
దయిత! వాసవదత్త! మత్ప్రాణభూత!
యరయఁగాఁ జాలనేమొ యీయద్భుతంబు! ౧౬౦

తే. పెల్లుగా వాన కెండకుఁ జల్లగాలి
కిని నలఁగి యున్న కందర్ప కేతుతోడ

నా నృపాలతనూజయు నంతమోచ
మై లలితమైన పల్కు నీలీలఁ బలికె. ౧౫౭

క. నా కొఱకుం గుడిచితి వతి
శోకము నీ వార్యపుత్త్రి! శోభన రాజ్య
శ్రీకిన్ దూరంబయి యే
కాకిగఁ జరియించి తకట! కాఱడవులలోన్. ౧౫౮

5. వె. ఉపవసించి డస్సియున్న చిత్తమున ని
ద్రా ప్రశాంతుఁడ నయి దప్పి జిక్కి
నట్టి నీకు నే ఫలాదులఁ గొని తేరఁ
జనితి ముందు మేలుకని హృదీశ! ౧౫౯

క. అటుఁ జని ఫల మూలాదిక
మట నిట నే వెదకుచున్ మహాటవిలో ముం
దటఁ దరు గుల్మాంతరితో
త్కట సైన్యనివేశమును దగన్ గనుఁగొంటిన్.

క. నను వెదుకఁ బంపఁ బడి బో
రన వచ్చిన తాత మొగ్గరమొ? యిది, కాకుం
డిన నార్యపుత్త్రు ప్యూహమొ?
యని నే యోచించితిన్ స్వయంబుగ మదిలోన్.

శా. ఆలోఁ బర్వున వచ్చె నెవ్వఁడో కిరా
తానీకినీనేతచా
రాళుల్ దెల్పిన వార్తమై బలయుతుం
డై దవ్వుగా నుండి వే

వాల్గ్ వెంటనె యింక నొక్కఁడు కిరా
తానీకినీ నేత య
ల్లా లీలన్ విని వచ్చెఁ బర్వెన మృగ
వ్యాసక్తుఁడై యుఱికియున్. ౧౬౨

తే. అంత నేకామిషంబున కాసపడిన
గ్రద్దలకుఁ బోలె వారికిఁ గలహమయ్యె
నపుడు దగె నర్క కిరణచయంబు నిబిడ
శరవరాసార దుర్దినచ్ఛన్నమగుచు. ౧౬౩

క. సమర కృతి విదగ్ధ కర
క్రమ దూరోత్క్షిప్త తీక్ష్ణ ఖడ్గదళితులై
సమిదుద్భటులగు ప్రతిభటు
లమరీపరిరంభమంది రాసమయమునన్. ౧౬౪

తే. కలహసంలోకనాగత గగన చారి
నేకచారణసముదయాస్తోక చరణ
రాజి రాజిలె నలయుద్ధరంగమందు
రాణఁ దీర్చిన తోరణ శ్రేణి వోలె. ౧౬౫

తే. ధ్వంసిత ధ్వజ వితతి పత త్పతాక
మతితర విశీర్ణ కరవాల మగుచు సైన్య
మఖిల మన్యోన్య వినిహత మయ్యె నప్పు
డేను గడు దైన్య మొందిన దానసైతి. ౧౬౬

మత్త. అంత నేముని యాశ్రమం బది
యాతఁడే సమిధాదికం

బంతయుం గొనివచ్చి యత్తఱి
యం దెఱింగి సమస్త వృ
త్తాంతముఁ ఘన యోగదృష్టి ని
తాంత భీత మనస్కుఁడై
యంతికంబున నుండు నర్ఁ రయ
మారఁ గన్గొని కిన్కతోఁ. ౧౬౭

తే. ఓసి పాపాత్మ! దుర్లలితా! సమృద్ధ
మస్మదాశ్రమ మిద్ది త్వదర్థ మిపుడు
ధ్వస్త మయ్యె నటంచు న త్తఱి శపించె
నతఁడు రాపుత్తళిక యగునట్లు నన్ను. ౧౬౮

ఆ. వె. అట్టి యీ వరాకి యావల మిక్కిలి
వ్యసనములను గుడుచు నని తలంచి
సంయమీంద్రు వేఁడ శాపముఁ ద్వత్కర
స్పర్శ మవధిగాఁగ సలిపెఁ గరుణ. ౧౬౯

క. అంత నిటుల్ తత్సతి వృ
త్తాంతముఁ గందర్పకేతుఁ డాలించి నిజ
స్వాంతం బబ్బురపడ దమ
యంతి మరలఁ గనిన నలునియటు లుప్పొంగెఁ.

తే. ఇంత లోపల మకరందుఁ డీ యుదంత
మంతయును జక్క నాలించి యరుగుదెంచి

వేడ్కఁ దద్దంపతులతోడ వేగఁ జేరెఁ
బాటలీపుత్త్రిమును స్వీయపట్టణంబు. ౧౭౧

క. కందర్పకేతుఁ డాపుర
మం దనిశము స్వస్సుదుర్లభాతి సుఖము లా
నందాబ్ధి లహరి డోలా
మంద విలాసాను బంధి మతియై కుడిచెఁ. ౧౭౨

మా. రజతగిరి విహారా! రమ్య భోగీంద్రహారా!
విజిత హరికుమారా! వీర్య దీ వ్యత్కుమారా!
అజముఖనుత చర్యా! హారి గాంభీర్య శౌర్యా!
వృజిన హరణ కార్యా! ప్రేమ సంభావితార్యా!

గద్య

ఇది శ్రీ రాజరాజేశ్వరీ ప్రసాదలబ్ధ కవితాధురంధర
భారద్వాజసగోత్రపవిత్రాశ్వలాయనసూత్ర ఉప్పల
పిచ్చయార్యపుత్త్రి నృసింహశర్మప్రణీతం
బయిన శ్రీమదభినవాంధ్ర వాసవ
దత్త యను కావ్యంబునందు
సర్వంబు నేకాశ్వాసము
సంపూర్ణము

---

లఘుటిప్పణము

సమోద సంఖ్య——

——తేది——

౧. బృందారక=దేవతలయొక్క; సందానిత=కట్టఁబడిన; వందారు=నమస్కరించునట్టి;

౨. పరిపంథి=శత్రువు.

౩. అబోధ=అజ్ఞానమను; నిరంతరాయము=విఘ్నము లేనిది; నిర్వ్యాజము=నెపములేనిది; ఉపాస్యము=సేవింపఁదగినది; మహంబు=తేజము.

౬. క్రన్నన్=పిమ్మట.

౮. పార్వణేందుఁడు = (పార్వణ + ఇందుఁడు) పర్వము (పూర్ణిమ) నాఁటిచంద్రుఁడు; మనీషన్=ప్రజ్ఞచే; భీ=వెఱపు; ఎల్ల=పొలిమేర.

౯. కైత=కవిత్వమును.

౧౦. ఎడాటమునన్=విషయమున; ఆదృతిన్=ఆదరమున.

౧౧. సోమునకున్=ఉమా(పార్వతీ)సహితునకు; సోమగాశన=(వాయువే ఆహారముగాఁ గల) సర్పమే; సోమధరునకున్=చంద్రధరునకు; సోమ=కుబేరునకు; సోమజ=(నీటఁబుట్టినది) అగ్ని; సోమ=కర్పూరమువలె.

౧౨. అవిరళ=ఎడతెగని; తివుర=పూను.

## కథాప్రారంభము

౧. దానర్ధిన్=దానముయొక్క పెంపుచే; నఖర=గోళ్లయొక్క; శ్రేణిన్=వరుసను; వ్యూహ=మండలముయొక్క; కష=సానరాయియొక్క; కర్షస్ఫూర్తి=ఒఱయికగా దోఁచునట్లు.

౨. మీను సిడెముదొరన్=మీనకేతనుని అనగా (మన్మథుని); మేలమాడు=అపహసించు; మైబెడఁగు=శరీరసౌందర్యము.

౩. శేఖరం=అంచము; మస్తకము=శిఖరము.

౪. అనన్యాదృశ=ఇతరులయందుఁ గనిపించని; రూపశ్రీ=రూపసంపదచే; రమ్యున్=ఒప్పినవానిని.

౫. హాసుదానిని=అందముకలదానిని; తోలఁకు=ప్రకాశించు; కడాని=అపరంజి.

౬. కటీ........పరిధిపరిది=సీలుఁదనుబంధునియొక్క మండలమువలె; ఒఱపుదానిని=సొగసుకలదానిని. కాంచి=ఒడ్డాణముయొక్క.

౭. కృశతాపటిమలన్=సూక్ష్మత్వము (బక్కటిల్లుట)ను, అస్వాధీనతను.

౮. పొంగమ్మి=బంగారుతామర.

౯. అతికరించి=క్రిందుపఱచి; ననుపు=అనురాగమును; డాలు=కాంతి.

౧౦. భూషిత=అలంకరింపఁబడిన; వదనంబులన్=ముఖముఁగలవానిని; కుంద............సదనంబులన్=మొల్ల మొగ్గలయొక్క శ్రేష్ఠమైనకాంతి సంపదకు మందిరములయిన వానిని; మౌక్తికకృతకదనంబులన్=ముత్తెములతోఁ, జేయఁబడిన జగడముఁ గలవానిని; రదనములన్=దంతములచే.

౧౨. మఱఁగి=డాఁగి.

౧౩. చిత్రకంబు=తిలకము; నిటలము=ఫాలము;

౧౪. అతను............హృదయుఁడు=మన్మథుని బాణములకు లక్ష్యమగుటచే, శ్రమపొందుచున్న చిత్తముగలవాఁడు; వలంతి=శక్తుఁడు.

౧౫. దయిత=ప్రియ; కాముయమానున్=కామించువాని.

౧౬. మత్స్యలాంఛన=మన్మథుని; ఆతంక=పీడయొక్క; విమోచనంబునన్=విముక్తివలన.

౧౯. సంగడీఁడ=మిత్రుఁడా!; పిశునుని=దుష్టుని;

౨౦. వాగ్మ్యాన్యసహాసితమరందుఁడు=మాటలపొందికచే నపహాసింపఁబడిన మకరందముఁగలవాఁడు; పరిమిత=కొలఁదియగు (మితిఁగల); ప్రభంగురతన్=కుంటువడుటను; ఉమ్మగిల్లె=ఉడికిపోయె.

౨౨. నల్వ = నన్నూఱు మూరల దూరము; నల్వశతమాత్రము= ౪౦౧౦౦ మూరల దూరము (11 మైళ్లు, దాదాపు ముప్పదియైదు ఫర్లాంగులును); ద్విశద్విగ (ద్విః + వర్గ)=క్రోశసమూహమును;

౨౪ మృగరాజ=సింగములచే; విత్రస్త=భయపెట్టబడిన; మృగర మణీకుల=ఆడుజింకల సమూహములచే; ఆకుల=చెదరిన; సముపాంతము= మూలలుగలది; కడవపుట్టువు = అగస్త్యునియొక్క; కొమ్మలు = శిఖర ములు, సగ్గించుకొన్న=అణగించుకొన్న; చదురులన్=పదరపు మెక ములను; సమయింపన్=వధింప; గమకించు, యత్నించు; ఎఱుకుల= బోయవారియొక్క; నెత్తమ్ములు=పానులు ప్ర...ణులు=చూచువారి మనస్సును సంతోషము పెట్టునవి న్ప...ల...ములు = మనోహరమైన యాక్రమముగలవి. లలితాన్పత్త్రకమములు. కు ..ములు=పుష్పములచే విచిత్రములు. వృ—వం...ములు=వెదురుటాకులయందు ప్రసరించినవి. (న్పత్తభేదము).

౨౫. హారి=మనోజ్ఞమగు; శైవాల=నాచు; కచ=వెండ్రు కలు గాఁగలది; శఫరాక్షీ=మీననయన; పద్మకుట్మల=తామరమొగ్గల నే; సుకుచ = చక్కని చనులుఁగలది; ఆవర్తనాభిబిల = సుడిగుండమను పొక్కిలిఁగలది; లహరి బాహులత=అలలను భుజవల్లరులుఁగలది; సమా శ్లిష్ట=కౌఁగిలింపఁబడినది; శిఖరి=పర్వతము.

౨౬. శాఖా=కొమ్మలయొక్క; ఛాయా=నీడలచేత; జనయి ష్యత్ = పుట్టించుచున్న; శ్రాంతిన్=సోలుటఁ గలదానిని; జంబూ తరువున్=నేరెడుమ్రానును.

౨౭. పెల్లు=అధికము; వేఁడివేలుపు; సూర్యునియొక్క; వెలుఁ గుల=కిరణముల; వెట్ట=వేఁడిమి; విహ్వలంబు=చీకాకు;

౨౮. కూటము = శిఖరము; డంబుగన్ = అధికముగా; విడం బింపగాన్=అనుకరింపఁగా.

౨౯. ప్రాఁతనెచ్చెలి=ప్రియమిత్రుఁడు;

౩౦. రచింపన్=నిర్మింపగా; హృత్=హృదయము అను. ఫల కాంతరమునన్ = పలకనడుమ; తలఁపునాగలన్ = సంకల్పము అను తూలికతో; లిఖితయౌదానిన్=వ్రాయఁబడిన దానిని.

౩౧. కలహాయమానములయి = తగవులాడు చున్నవి యయి, శారిక=గోరువంక.

౩౩. తరళాక్షర=తొట్రుపడు వర్ణములతో; పూరిత=నిండిన; వాక్ప్రచారయై=మాటలను వెసల నిచ్చినదియై; కితవ = వంచక; శార్యంతరము=వేఱొక గోరువంక; అర్మిళి=ప్రేమ.

౩౪. కాలలంఘనము=వేళమీఱుట; కతంబు=కారణము.

౩౫. హాహూ=నేర్పు

౩౬. బంధము=వస్తువు.

౩౭. వప్రాంతములు=కోటకొమ్మలు; బలిభవనము=పాతాళము; పనాళ్ళగ్మము=ఆకసము; (స. గ్గము), (మంచిత్రోవ). సదాగతి=వాయువు గోభూమి=వాక్కు, అర్జుని (పక్షమున) కిరణము. ధర్మాంచితశీలము=ధర్మముచే నొప్పిన ప్రవర్తనముకలది; ఇంద్రాణి=శచి; బంధవిశేషము నాకసుందరీ=అప్సరస; పైకము=కోకిలలగుమి; పల్లవ=చిగురు (విటుల) వారజనము= వేశ్యాజనము.

౩౯. కలిన్=యుద్ధమున; రిపులన్ = శత్రుల; మొక్కలపు=శౌర్యముగల; అన్యకృత రోధములుగాని=ఇతరులచేఁ జేయఁబడిన యడ్డంకులు లేని; ప్రోలు=పురి; జాను=సొగసు.

౩౯. సురతా.........భుజుఁడై=సంభోగము వలని బడలిక చేత నిద్రించిన యంపక త్రియల స్వచ్ఛమై మెఱయుచున్న మణులచేఁ బ్రకాశించునట్టి కమ్మలచేతఁ జిహ్నితములయిన గొప్ప బాహువులు గలవాఁడు. ఉద్ధుర.........మహేంద్రుండు=నిలుకడఁగల లక్ష్మీసంపన్నతచేఁ గ్రిందు చేయఁబడిన దేవేంద్రుఁడు గలవాఁడు.

౪౦. మారర=శత్రువులయొక్క తావి=సువాసన; ధనుర్జీవ=వింటి అల్లెత్రాటియొక్క; సమాకర్షణమునన్=లాగుటచేత; దాయన్=పగతుని; విగతాసున్ = కోలుపోయిన యసురులుగల వానిఁగా; అమేయబలుఁడు= మితిలేని బలముఁగలవాఁడు.

౪౧. నిశలన్=రాత్రులయందు; మలినాంబరత్వము=అపరిశుభ్ర వసనము (నల్లనియాకసము) గలిగియుండుట; విదగ్ధ=నేర్పరులగు వారియొక్క; రతులన్=సంభోగములయందే; రశనాబంధము = మొలనూలి

కట్టు (శేషయోరభేదః—గసనాబంధము) నాలుక కట్టుబాటు (మౌనముద్ర). అధరములనె=మోవులయందే; భృశము=అధికముగా; ద్విజ=దంతముల యొక్క; హతుల్=క్షతములు (ద్విజహతుల్=బ్రాహ్మణపీడనములు), పొరయదు=సంభవింపదు.

౪౨. సుకుమార=సుకుమారురాలు, మంచి కుమారుఁడు (కుమారస్వామి) కలది.

౪౩. రూపమదమత్త=రూపమదముచే మదించినది; మనోజ=మన్మథునియొక్క; లలిత=సుందరమగు; విజయధ్వజ=జయపతాక; సకలలోక సంభవనీయ=ఎల్ల జగములచేత నపేక్షింపఁదగిన; లావణ్య=కాంతిఁ గలది.

౪౪. జృంభమాణ=వికాసవంతమగు; లావణ్య=సౌందర్యముఁగల; తరుణభావము=యౌవనము; ఒదవెన్=కలిగెను; తరుణిమమునన్=యౌవనముచేత; పరిణామ=పరిపక్వమైనది; ఒల్లఁబాటు=ఇచ్ఛలేమి.

౪౫. ఆమని = వసంతము; కృతాంతునకు = యమునకు; దద్దఱిల్లన్=భీతిఁ జెందఁగా.

౪౬. మదిర=మద్యము; పంకిన=తేమ; రసణించు=శబ్దించు; తొమిరె=యువతి; విరిసెన్=విచ్చెన్; పోతరము=గర్వము, మదము తలిరు పిండులు=పికములు; అఁబలములు=కలకలములు; పొలయల్కపాటువలు=ప్రణయకోపములతోడి కలయికలు; ఓసిల్లు=కాలునట్టి; చాలు=వరుస; త్రోఁటిన్=ముక్కుచే; పాటలము=కలిగొట్టు

౪౭. వృంతనిర్గత=తొడిమనుండి వెడలిన; విచికలవివరమునన్=మల్లియయొక్క రంధ్రమున; మధుస్రుతము=తేనెస్రావ.

౪౮. యావక=లత్తుకచే; అంకిత=చిహ్నితమైన; రమణీ=విలాసవతియొక్క; కమనీయ=సొంపైన; పల్లవవ్యాజమునన్ = చివుళ్ల నెపమున; రాగసరణిన=రక్తిమవిధమునే.

౪౯. పృథుల=గొప్పవియగు; గుచ్ఛ=గుత్తులచే; వినత=వంగినది; విదిత=స్పష్టమైన; పుష్ప=సుమములయొక్క; ఉద్భేద=(వికసనము) పుట్టుకఁగలదియు; తరుణపల్లవ=లేఁజివుళ్లయొక్క; ప్రధాన=ముఖ్యమైన, రాగ=రక్తిముచే; మాననీయ = ఔన్నత్యముం గాంచినదియైన;

మల్లికా=మల్లెతీగ; సహకారకలిత యను చుణ్ = తియ్యమామిడిని గూడినదియై; చెలువుఁ గాంచెన్=అందమొందెను. (అర్థాంతరము:— ప్రఫుల్ల=మనము లైన; సుమ (స్తన)= స్తబకములచే; వినత=వంగినదియై; పుష్పోద్భేద = రజః ప్రాదుర్భావము గలదియై; తరుణ = యౌవనులగు; పల్లవ ప్రధాన=విటముఖ్యుల (లేక) పల్లవవిటులయొక్క; ప్రధాన=ముఖ్య మైన; రాగ = అనురాగముచే; మాననీయ = గౌరవింపఁదగినది యైన; మల్లిక=మల్లికయను లతాంగి; సహకార కలితయనుచుణ్=చెలువుని తోఁ గూడినదియై; చెలువుఁగాంచెన్=అందమొందెను.

౫౦ కుటుంబు=పృథము లగు; గంధపుఁగొండ=మలయపర్వతము; ప్రల్లదీఁడు=దుష్టుఁడు.

౫౧. మున్నడి = ముందుగనే; కన్నులవిల్లు = (గనుపులుఁగల) చెఱకువిల్లు; కంతుఁడు=మదనుఁడు; మన్నీఁడు=రాజు.

౫౨. పెల్లు=అధికము; ఉపవేశము = కూర్చుండుట; పురంధ్రులు=కుటుంబినులు.

౫౩. వంది=వందులయొక్క; ఘోష=(స్తుతి) ధ్వనులచే, నంది ఘోషమను అర్జున రథముచే; ముఖరిత=మ్రోగింపఁబడిన; ఆశాంతరము=దిగంతరము; విస్మయావహము=అబ్బురము కలిగించునది.

౫౪. చొక్కపుమై=అందమగు మేన; వలపుల్=సువాసనలు; చక్కటికిన్=చోటునకు; వలఁగొన్న=చుట్టుకొన్న; చాల్పులు=వరుసలు.

౫౫. మంచావిష్టులు=మంచములపైఁ గూరుచున్నవారు; రక్త= అనురక్త (ఎఱ్ఱనిది); శ్యామ = యౌవనమధ్యస్థురాలు–చామనచాయ గలది; కంత్రీరథము=పల్లకీ (మనుష్యులు మోయు నొక విమానవిశేషము) సాంగన్ = శరీరసహితుఁడైన; దసపరి = అందకాఁడు; పుణ్యసింధు రూపము=పుణ్యనదీస్వరూపము; తుంగ, భద్ర=పొడవై సలక్షణమైనది (తుంగభద్ర యను నది); వాస=ముక్కు; నర్మద = నర్మాలాపము లొసంగునది (నర్మదా నది) యగు; కబరి = కొప్పుగలది; మానిత= పూజింపఁదగు; సర్వవ్యాహిని=సర్వపర్యంత వ్యాప్తిగలది (గంగానది); మాలిని=పుష్పమాల గలది (మాలినీ నది).

౫౮. కోశనిశాంతంబు = బొక్కసము; వైదగ్ధ్యము = నేర్పరితనము; ఆపర్యము=ఇద్దము.

౫౯. కూరుకు=నిదుర; రాజసు...దుర్లలిత = రాజకుమారునిఁ గనుఁగొనుటచే భావవికారము చెందినది; మాపటిలెడు=పరిక్షపించెదు.

౬౦. తొలిబాము=ముందటిజన్మము.

౬౧. నలహేతువునన్=నలునికారణమున; (తృణకారణమున); భోజసుత=ఇందుమతి; మహిషీభూతయయ్యును = మహిషిప్రాయయయ్యును; (సైరిభ స్త్రీభూతయయ్యును); అజానురక్త = అజమహారాజునందు అనురాగముగలది; (ఛాగమునందనురాగముఁ గలది); స్నిగ్ధ.....రంభ = సుందరములగు తొడలకాంతిచే జయింపఁబడిన యనఁటి కంబములు గలది.

౬౩. కుమ్మినన్ = పొట్టునిప్పున; దవోపగూఢ=కార్చిచ్చుచేఁ బొదువఁబడినది; దారుణ.....గాత్ర = భయంకరమగు వసంతమను అగ్నియొక్క ప్రజ్వరిల్లునట్టి యెడతెగని జ్వాలల సముదాయముచేఁ గ్రమ్మికొనఁబడిన శరీరముగలది; మలయాచల.....అవలీఢ=మలయ పర్వతమే నిలయముగాఁ గలిగినట్టియు. అతిశయించునట్టియు గాలి యను రుద్రునియొక్క యెక్కుడగు క్రోధాగ్నిచే నాక్రమింపఁబడినది.

౬౪. ఉన్మాద.....పతిత = ఎడతెగని చిత్త విభ్రమమను పాతాళగృహాంతరమునఁ బడినది; శూన్యేంద్రియ=విమత్రమ విషయములు గ్రహింపఁజాలని యింద్రియములు గలది; లిఖితుఁబోలెన్= వ్రాయఁబడిన వానివలె; ఉత్కీర్ణుఁబోలె; సానయందున నాకృతి యేర్పఱుపఁబడిన వానివలె; ప్రత్యుప్తుఁబోలెన్=(అంగుళీయకము మొదలగు వానియందు వలె) పొదుపఁబడిన వానివలె; మజ్జాశబలితుబలెన్= మూలగలో మిశ్రితునివలె; కీలితునివలెన్ = (ఇనుపశలాకచేదారు ద్వయమువలె) కదింపఁబడిన వానిని; వజ్రసార=(కట్టల నతికించుబంక= సరేసు) వజ్రముచే; నికామ=అత్యంతము; ఘటితుఁడు = కూర్పఁబడిన వాఁడు; రక్తాశయమునన్=రక్తనివాసస్థానమగు కోశమునందు.

౬౫. ఉన్మత్తపలె=వెఱ్ఱిదానివలె; అంధయుంబలె=గ్రుడ్డిదానివలె; బధిరయుఁబోలెన్ = చెవిటిదానివలె; శూన్యఁబోలెన్=లేనిదానివలె;

అపాస్తేంద్రియయుం బోలెన్=పోయినయింద్రియములు కలదానివలె; అబ్ధి=సముద్రము; చలించెను=కదలెదు; తరగలచేన్=అలలచే; పరీత=చుట్టుకొనఁబడినది; దర్పకశరకీలితయుఁ బలెన్ = మదనబాణములచేఁ గట్టుపడినదియు వలె; రాగంపుద్రాఁటన్ = మోహమను పాశముచే; సంబద్ధ=కట్టఁబడినది; సమా......అవయవఁబోలి=దిరుగుడువడు నన్ని యంగములు గలదానివలె.

౧౭. ముక్తామార్గము=ముత్తెములపాడి; రంభాదళ తాళవృంత ములన్=అనఁటియాకు వీవనలతో.

౧౮. సొమ్మసిల్లెన్=మూర్ఛిల్లె.

౧౯. సమ్యక్......పులినంబునందు = మిగుల చల్లనైన పచ్చకప్పురపు మేలిరసముచే నిండిన నదియొక్క యిసుకతిన్నియపై; అధిక......ప్రాంతమందున్ = కడుచల్లనైన చందనగసముయ మగు నదియొక్క రమ్యతీర ప్రదేశమున; అరుణ......ఛాయన్; ఎఱ్ఱనిబంగరు తామరలచే నొప్పుచున్న కొలఁకుల యొడ్డులయందలి సుందరములగు గందఁపు మ్రాఁకుల నీడయందు; అలస......స్థలులన్=మెల్లని గాలులచేఁ గదలుపఁబడిన యాకులచే నొప్పుచున్న యనఁటితోఁటల మధ్య ప్రదేశములయందు; కోమలములు=మృదులములు; పద్మినీ......యుతములు=తామరపాకు పటుపులయందలి మంచు పెల్లువలని చల్లఁదనముతోఁ గూడినది.

౨౧. తెర=అల; ద్విజకులంబు = బ్రాహ్మణకులము; శ్రుత్యంత సంగమనోజ్ఞము=వీనుల తుదిలవఱకైన కూడికచే సుందరము (వేదాంతములవఱకైన కూడికచే సుందరము; నైసర్గిక=సహజమగు; ఆమోదము=పరిమళము; దూరనిర్గతమై=నిడుపుగ వ్యాపించినదై.

౨౩. బింబితుఁబోలెన్; ప్రతిఫలించిన వానివలె.

౨౪. ఒడికంబుగన్=ఇంపుగ.

౨౫. నిజోదంతము=తనవృత్తాంతము.

౨౬. ప్ర. భావ=ప్రత్యక్షమగునట్లు తెలియఁబడిన అభిప్రాయముకలది. (స్వాభిలాష విషయీభూత పురుషాభిప్రాయము కలది) అని భావము. అస్థిర=అదృఢమగు (అనగా=చంచలమగు) స్వ...భావ=

స్వప్నకాలమందు అను భూతమగు నభిప్రాయముకలది. ప్రత్యయము= విశ్వాసము; 'ప్రత్యయః శపథే రంధ్రే విశ్వాసాచారహేతుషు; ప్రథితత్వేచ సన్నాదావధీనజ్ఞానయోరపి' అని విశ్వనిఘంటువు. విశేషములు చదువరు లూహించునది.

౨౯. మర్త్యమజగంబు=భూలోకము; అవతరించెన్=దాఁటెను; సమధిక......తుపణుఁడగుచున్=మిక్కిలి యెక్కువైన చీఁకటిగుంపుచే నశుచిభావమును బొందిన వాఁడగుచు.

౩౦. తిగ్మఘృణి=సూర్యుడు; రథాంగ = చక్రవాకములయొక్క మందిమంబు=మందత్వము; గుళుచ్ఛ=గుత్తియొక్క.

౩౧. దిన........రామణీయకము=దినమను కోడియొక్క వెలుఁగుచున్న జుట్టుయొక్క మండలాకృతి సౌందర్యము; సిందూర... ...కుంభంబుతో=చెందిరపురేఖలచేత నెఱ్ఱగాఁ జేయఁబడిన దేవేంద్రుని మదపుటేనుఁగు (ఐరావతము) యొక్క కుంభస్థలముతో; దీటు=సాటి; నృత్త......ప్రభ=నటనమువలనఁ గదలునట్టి శివుని జటాజూటము నందుగట్టిగాఁ గట్టఁబడిన వాసుకియొక్క కర్ణభూషణపు కాంతి; సంధ్యాం......ద్యుతి=సంజయను కాంతియొక్క తడిసిన లత్తుకచే రచింపఁ బడిన మకరికాది పత్రముల కాంతి; పృథుల.........సమత్వము=మిగుల గొప్పదగు కాలమను ఖడ్గముచే ఛేదింపఁబడిన దినమను మేటి దున్నయొక్క గుండ్రని మూఁపుతో సామ్యము.

౩౨. గణికాగణము=వేశ్యాసమూహము; ముద్ర = (చిహ్నము) చేవ్రాలు; సవిధ=సమీపమందలి; కాపేయ......కలిలము = కపిచేష్టలచే వికలములైన క్రోఁతుల గుంపుచే నిండినది; కోటరంబులన్=తొఱ్ఱలలో

౩౩. మాంజిష్ఠ=ఎఱుపు(రంజనద్రవ్య) సంబంధియైన.

౩౪. తాపింఛ=చీఁకటిద్రుమానియొక్క; సైరిభ=స్త్రీసమూహము యొక్క; మాంసలితమై=దట్టముగా చేయబడినదియై; దంతావళీ...... వృద్ధంబునై = ఏనుఁగులగుంపుయొక్క యొప్పుచున్న చెక్కులనుండి జాఱుచున్న మదజలబిందువులచేఁ జక్కఁగఁ బెంపొందింపఁబడినదియై.

౩౫. శార్వరంబు=రాత్రియందుఁ గలిగినది; కాళిమము=నలుపు.

౮౪. ప్రస్థాన = యుద్ధయాత్రకైన; ప్రక్షిప్తమై = ఘటితమై మస్యంప్రు=అంపబడిన.

౮౭. స్వైరిణులు=స్వేచ్ఛగా సంచరించు స్త్రీలు.

౮౯. స్ఫాటికాయతనము = పటికపురాలచేఁ గట్టఁబడిన భవనము.

౯౦. భవత్తనయుఁ=కుమారస్వామిని; దుహిత=కూఁతురియొక్క

౯౨. నభోభ్రమము=ఆకసమును భ్రమానియొక్క; సుమమంజరుల్=పూగుత్తులు; వ్యోమ=ఆకసమున; పతాకికల్=టెక్కెములు; ఉడుగణము=నక్షత్రపంక్తి; ఆహూత=పిలువఁబడిన; బర్హిణప్రసయంబు=నెమిళులగుంపు

౯౩. మంజిమము = మనోజ్ఞత్వము; ఉత్పత్తిపదము = పుట్టినచోటు.

౯౪. ప్రధావించెదవు=పరుగిడెదవు; ద్రవసిద్ధికి=కేళిలాభమునకు (నగ్నికిద్ధికి; ద్రావకౌషధీసిద్ధికి); చపలాయిత=మెఱుతీపుగెవలె నయినది; అభిహిత=జెప్పఁబడినది.

౯౫. సురయా=అతివేగముగలది; సురయాచిత = దేవతలచేతను ప్రార్థింపఁబడినది (నారాయణునిచేఁ బ్రార్థింపఁబడినది); శ్రీ=శోభ (లక్ష్మి); క్వణితఫణితిఁ=ధ్వనులరీతిని.

౯౬. మలయేప్సితాప్తి = మలయపర్వతమునం దభిలషింపఁబడిన వస్తువుయొక్కప్రాప్తి (చందనము). (మ=శివుని యందు; లయ=నాశము గల (మదనునికా); ఈప్సిత=హృద్యుఁడగు ప్రియుని); (మ=శివుఁడు; లయ=గృహముగాఁగల (చంద్రునియొక్క); ఈప్సితాప్తి=హరిణప్రాప్తి)

౮౪ విహితము=(చేకై) చేయఁబడినది; యుక్తమైనది.

౯౭ సోత్కలిక=ఉత్కంఠతోఁ గూడుకొనిన దానా!

౯౯. సతీవ్రత=సతీవ్రతము గలదానా; తీవ్రత్వము.

౧౦౧. కరక=వడగండ్లకు; స్రగాకలితము=మాలతోఁగూడినది.

౧౧౧ కుటిలాసిత కుంతలిక!=వక్రములును, నల్లనివియును నగు కురులుగల దానా.

౧౦౨. స్తనజ్జనుఁడు=సుజీతశబ్దము నొనర్చుజనుఁడు; (లేక) సంకేతదానమునకై పక్ష్యాదిశబ్దము లొనర్చు జనుఁడు.

౧౦౩. స్మరజని=మదనునియొక్క యుత్పత్తిఁగలదైన; (మద నోద్దీపకమయిన దని భావము). నిశాతనఖాగ్రములన్=వాఁడిచేతఁ గ్రూర ములయిన; కురుతమునన్=కుచ్చితపు ధ్వనిచేత.

౧౦౪. కిశోరము = గుఱ్ఱపుఁబిల్ల; దోహలమునన్ = శ్రద్ధగా; క్రీడాశకుని=ఆటకై పెంచిన పక్షులయొక్క; మరీచదళంబును=మిరియ పుటాకును; చంద్రకిపోతంబును=నెమలిపిల్లను.

౧౦౬. విస్ఫారితాక్షిన్ = విప్పఁబడిన కంటితో; సొమ్మ= మూర్ఛ.

౧౦౭. విస్రంభగాథ=ప్రేమాలాపములయొక్క.

౧౦౯. ఒఱపు=తేజస్సు.

౧౧౨. మంత్రణచేసి=యోచించి.

౧౧౩. సదాగతి = మంచిరాకఁగలది; (సదాగమనము కలది.) మానసగతి=మనస్సువలె గతిఁగలది; (మానస సరస్సునుగూర్చి పోవునది.

౧౧౪. గవ్యూతి=రెండుక్రోసులదూరము.

౧౧౫. సతత.....సంకులాగ్రము = నిరంతరము నరమాంస మును భక్షించుటకుఁ దొట్రుపడుచున్న రాపులుఁగు లను పక్షుల సము దాయముచే మిక్కిలి వ్యాప్తమయిన అగ్రప్రదేశము గలది; అతి... ...కలితము=మిక్కిలి భయంకరములయిన శవములను లెస్సగాఁ గబళిం చుటయందుఁ దీక్ష్ణధ్వనిఁగల పిశాచవిశేషములయొక్క యార్భటముల చేఁ గూడినది. ఉల్కాముఖ.....నికటంబు=కొఱివిదయ్యముల మొగ ములనుండి ప్రజ్వరిల్లుచు, వ్యాపించుచున్న గొప్పజ్వాలలచే జటిలము లయిన సమీపప్రదేశములు గలది; విచలత్... .....యాతంబు= తిరుగుచున్న పిశాచములచేఁ జేయఁబడిన శవవిభజనమునందుఁ బుట్టిన కలకలధ్వనులతోఁ గూడుకొనినది; కర్కశా.....కీలి=గట్టిదియగు పచ్చినరమును మంగళప్రతిసరము (వైవాహిక కంకణము)గల భూతముల జంటచేఁ జుట్టబడిన చితియొక్క తీక్ష్ణాగ్నికలది. శవ.....కీర్ణతలము= శవాగ్ని చే దహింపఁ బడుచున్నవియుఁ, బగులుచున్నవియు, భయం

?రముగ ధ్వనించుచున్నవియు నగు మనుష్య కపాలములచే వ్యాప్తమైన ప్రదేశము గలది.

౧౧౬. వేళంతదంతుర ప్రాంతము=పడియలచే మెండయిన చేరువలుగలది. సంప్రవృద్ధార్క–సముదయము=మిగుల పెంపొందిన సూర్యుల సముదాయముచే; (పెరిగిన జిల్లేళ్లగుమిచే). స్వతంత్ర......సీమ=స్వతంత్రముగానున్న యింద్రునియొక్క కౌతుకమున కెల్ల; (స్వేచ్ఛగానున్న గూబలయొక్క సంతోషమునకెల్ల). శ్రీ......సముల్లసితము=బిల్వఫలములయొక్క యభ్యుదయముచేఁ బ్రకాశించునది, (సంపత్తులయొక్క యభ్యుదయముచే శోభిల్లునది). అశోకసరళ పున్నాగ=అశోకములు, దేవదారువులు, పొన్నలు, (దారిద్ర్యాది దుఃఖరహితులు, విద్వాంసులు, దక్షిణులు నగు సత్పురుషులు) గలది.

౧౧౭. దూరాధ్వగతి=పెద్దయిన త్రోవ నడుచుటచే.

౧౧౮. రాత్రితరి=రేయి యనునోడ; సమయధీవరునిచే=కాలమను జాలరివానిచే; ఋక్షమత్స్యతతి=చుక్కలను మీనులగమి; హ్రియమాణము=హరింపఁబడినది.

౧౧౯. అరుణ......పాళి=సూర్యుఁడను గుంప్రపని జుట్టుచే మనోజ్ఞమైనది. పుష్కరాంగణమునన్=ఆకసమను ముంగిట.

౧౨౦. ద్విజరాజు=చంద్రుఁడు; (బ్రాహ్మణశ్రేష్ఠుఁడు) వారుణీసంగంబున్=పడమటిదిక్కుతో సంబంధమును; (మద్యసంబంధమును) పతితుఁడు=పడినవాఁడు; (భ్రష్టుఁడు).

౧౨౧. అరుణ.........ధార=సూర్యుఁడను సింహముయొక్క గోటికొనలచేఁ బగుల్పఁబడిన చీకటియను యేనుఁగుయొక్క నెత్తుటిధారచే; హరి.........సుధూళి=సూర్యాశ్వముల గొరిజలచేఁ బగుల్పఁబడిన యుదయపర్వతమందలి పద్మరాగ మణులయొక్క చక్కనిపరాగముచే; హరిహరిదద్రి=ఉదయాద్రియందలి; గైరికఝురాంబుల=గైరిక ధాతు సమ్మిళితమగు సెలయేఁటులచే.

౧౨౨. వికస......గోళకము=మంజిడి (ఎఱ్ఱనికాంతి)చే మనోజ్ఞమగు పట్టుదారపు టుండయో! ప్రాచి......సమంచితమయి=తూర్పు

దిక్కను స్త్రీయొక్క యొడ్డాణమున సంజయను నెఱ్ఱని దారముచే నొప్పినదయి.

౧౨౪. భిన్నోజ్జ్వల విద్రుమ శోణరుచిక్=పగిలినదయి ప్రకాశించుచున్న పవడముయొక్క యెఱ్ఱని కాంతివంటి కాంతితో.

౧౨౫. దివసకాంతోపలముల=సూర్యకాంత శిలలయొక్క; జగా=గొప్ప.

౧౨౬. గుంజన్మధువ్రతమా=ధ్వనిసేయుచున్న తుమ్మెదలు గలదియగు; వినిష్పందేంద్రియగ్రామండై=తిరుతమ విషయముల గ్రహింపఁజాలని అనఁగాఁ జలించని యింద్రియముల సముదాయము గలవాఁడై.

౧౨౭. సర్వాశాంత సమ్యక్ప్రసాధనుఁడు=సమస్తదిగంతముల మిక్కిలి యలంకరించువాఁడు. (యర్థాంతరము;) సమస్తాభిలాషములను మిక్కిలి నెఱవేర్చువాఁడు.

౧౨౮. ద్రుభూములక్=వృక్షప్రదేశములయందు; చలత్...... సంచయమందు=కదలుచున్న యెండుటాకుల గుమియందు.

౧౩౩. నియతివిపాకము=విధిపరిణామము.

౧౩౪. విసదృశత=అననుగుణత్వము.

౧౩౬. ఇలుగఁగాక్=మరణింపఁగా.

౧౩౭. నవ్యనళ......సాంద్రమగుచుక్=నూత్నములైన తృణవిశేషములచేతను, వట్టివేళ్ల చేతను, దామరతీఁగెలచేతను, పొగడలు మొదలైన సమస్తవృక్షములచేతను, దట్టమయి; చపల......భూభాగమగుచు=చంచలస్వభావము గల స్రోఁతుల సమూహముచేఁ గదలుపఁబడి జాఱుచున్న ఎక్కువ తేనెతుంపురులచేఁ దడిసిన భూప్రదేశము గలదై; దక్షిణ......మగుచు; మలయవాయువులచేత సుఖముగాఁ గంపింపఁ జేయఁబడినదై యొప్పుచున్న పనసచెట్లయొక్క కొమ్మలు గలిగి; దాత్యూహ......మగుచు=బరతపిట్టలయొక్క కుహూకుహూ ధ్వనులతో నిండిన యేళ్లయొక్క గొప్పగట్టులయందలి పొదరులసముదాయములు గలదై; నూత్న......మగుచు=క్రొత్తవైన యశోక పల్లవముల యొక్కదైనకాంతి సమూహముచేఁ బూయఁబడిన దిక్కుల సముదాయము గలదై.

౧౩౭. సతత......మగుచు=ఎల్లప్పుడును జాతిపువ్వుల సువాసనలచేనొప్పు చాపజాళ్ళపై సుఖముగ నిద్రించు కుందేటిపిల్లల సమూహముగలది; మహిత......మగుచు=గొప్ప తియ్యమామిడిపనముల నెవళ్లు లేయుటయందు గమనమించిన వసరపుమేకముల గుంపులు గలదై.

౧౩౮. సలలిత......మగుచు=ఇంపుగ సమీపించిన కిన్నరస్త్రీల కంఠగీతముల వినుటయందు నుత్సాహముతో కూడిన జింకలసముదాయము గలదై; వంశ......మగుచు=వెదురుగల గమిచేఁ గలుపఁబడిన క్రోఁతుల యొక్క మిక్కుటములగు నఱచేతి దెబ్బలచేఁ బడిచచ్చిన పురుగుల గుంపు గలదై.

౧౪౦. సాగర కచ్ఛోపాంత భూమిక్=సముద్రముయొక్క కసెముల సమీప ప్రదేశమున.

౧౪౧. జలమానుషీ=జలమనుష్యస్త్రీల యొక్క; శకుని...... మగుచు=పక్షిసమూహముల గ్రింగుటయందు వ్యాకుల పడుచున్నవై. యొంతియు నెగిరిపడెడు గొప్ప మొసళ్ల గుంపుల తిరుగుటగలదై; శర కరి=నీటియేనుఁగుల చేతను, తిమింగిల గిలాళీ=తిమింగిలములను భక్షించుచున్న వి శేషముల సమూహము; మహిత...దాని=గొప్ప యలల మీఁది గాలిచే మర్మరధ్వను లీనుచున్న, మిపులపొడవైన తాటిచెట్టులు గల వనమధ్యమున ద్రిమ్మరు జలమనుష్య మిథునముల సమూహముచే ననుభవింపఁబడిన మనోజ్ఞములను నిసుక తిన్నియలును. నాఁచును గల దానిని.

౧౪౨. దయ్యంబె=దైవమే.

౧౪౩. అనాతురాత్మప్రహతి=పీడలేనిశరీరమును చంపుకొనుట.

౧౪౪ ద్విజరాజు=చంద్రుఁడు (బ్రాహ్మణోత్తముఁడు;) అహంయువు=అహంభావము గలవాఁడు; గురుదార=బృహస్పతి పత్ని యగు తార; (తనకంటె పెద్దవానిభార్య;) ఎగపునక్=గర్వముతో; అభిభూతుఁడు=తిరస్కరింపఁబడినవాఁడు; భుజంగత్వము=సర్పత్వము (విటత్వము;) భిన్న=మిగుల; ఉన్మదితుఁడయి=చిత్తవిభ్రమము గలవాఁడయి. ....... ......=ఆక్షేపణ లేనివాఁడు; తొఁఱఁగెద=పద లెదను; ......కపరసంతతి=లకుముకి పిట్టలగుంపు; కీర్ణము=కప్పఁబడ్డది.